Regd No. M.1118.



# ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA ROW. SUNDAY EDITION.
Vol. 36. ANDHRA PATRIKA, MADRAS, 18th DECEMBER 1949 No. 255





# "బ్రిటన్‌తో భారత రిపబ్లిక్ ఒడంబడిక చరిత్రాత్మకమైనది"

## కర్తవ్యం నిర్ణయించకుండా ప్లానింగ్ కమిషన్‌ను ఏర్పాటు చేయడానికి భారతప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబరు 16: ఇండియాప్రభుత్వంవారు ప్లానింగు కమిషన్నొకదానిని ఏర్పరచనున్నారనీ, అందులో కనీసం ముగ్గురు సభ్యులుంటారనీ తెలుస్తున్నది. ఈ ప్లానింగు కమిషనువారు చేసే శిఫార్సులను మంత్రివర్గ ఆర్థికసంఘంవారు పరిశీలించి అందు సాధ్యమైనవాటిని అమలుజరుపుతారు.

ఈ కమిషనువారుచేసే ప్లానింగుఏమిటని అందరికీ సందేహంగానేఉంది. డబ్బు లేనికారణంచేత అభివృద్ధిపథకాలకింద రాష్ట్రాలకు ఇవ్వవలసిన గ్రాంటులనూ, ఋణాలనూ కేంద్రప్రభుత్వం నిలిపివేసిన మాట అందరికీ తెలిసినదే. ఈ కారణంచేతనే తన అభివృద్ధి ఖర్చులనుకూడా కేంద్రప్రభుత్వం చాలావరకు తగ్గించింది. ఇప్పటి అంచనాలనుబట్టి 1951 మార్చి 31 వరకు కొత్తఅభివృద్ధి పథకాలు తలపెట్టడానికి డబ్బులేదు.

ఇటువంటి పరిస్థితులలో ప్లానింగుకమిషను ఏర్పాటువల్ల బడ్జెటులోటు పెరగడంమాట అటుంచి, ప్రజలను వంచనచేయడంఅవుతుంది. ఒకవేళ ఈకమిషను కేంద్రప్రభుత్వ శాఖలమధ్యగాని, రాష్ట్రప్రభుత్వాలమధ్యగాని సమన్వయంకుదర్చడానికి ఏర్పాటయితే అందువల్ల లాభంఉండవచ్చు. అయితే ఈ విషయంలోకూడా ఈ కమిషనుకు భారతప్రభుత్వంకన్న ఎక్కువఅధికారమూ పలుకుబడి ఉండవు. రాష్ట్రాలమధ్య ప్రభుత్వమే సమన్వయం కుదర్చలేకపోయినప్పుడు ఈ కమిషను కుదర్చగలుగుతుందని ఆశించడంవ్యర్థం. ఇక ప్రభుత్వశాఖలు తీసుకొంటే వాటిమధ్య సమన్వయం సాధించడానికి రెండు కమిటీలు, ఇకనమిక్ కమిటీ, ప్రయారిటీ కమిటీ, ఉన్నవి. కేంద్రమంత్రులు బహిరంగంగా పార్లమెంటుసభ్యులను సర్దారు పటేలు శిఫార్సులకువిరుద్ధంగా రెచ్చగొడుతూ ఉండగా ఈ కమిషను ఏమి సమన్వయం సాధించగలుగుతుంది? కాని ప్లానింగ్‌కమిషను ఏర్పడుతుందని లాబీ వర్గాలవారంటున్నారు.

## బల్గేరియా మాజీ ఉపప్రధానికి ఉరిశిక్ష అమలు

సోఫియా, డిసెంబరు 16: బల్గేరియా మాజీ ఉప ప్రధాని ట్రెకో కోస్టోవ్‌ను, నేడు బల్గేరియా అధికారులు ఉరితీసివేశారు.

బ్రిటీషు, యుగోస్లావియా అమెరికా గూఢచారిదళాలతో కలిసి బల్గేరియా ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి కుట్రపన్నాడని, ఆయనపై మొన్న మంగళవారంనాడు మరణశిక్ష విధించారు. బల్గేరియా ప్రధాని కీ||శే|| జెమిట్రావ్‌ను చంపడానికి గూడా ప్రయత్నించాడని టిటో అధికారంలోకి రావడానికి తోడ్పడ్డాడని యీయనపై నేరం ఆరోపించబడింది. తాను సోవియట్‌రష్యాకు వ్యతిరేకమైన చర్యలు చేశానని ఒప్పుకొన్ని, మిగతా నేరాలను ఒప్పుకో నిరాకరించాడు.

కోస్టావ్ వయస్సు 52 సంవత్సరాలు. తనను కరుణించి విడువవలసిందిగా, కోస్టోవ్ బల్గేరియా నేషనల్ ఎసెంబ్లీకి విజ్ఞాపన పంపుకొన్నాడుగాని, విజ్ఞాపన నిరాకరింపబడినది. ఈ దరఖాస్తులో మాత్రం తనపై మోపబడిన అన్ని నేరాలను ఒప్పుకున్నాడు.

## నైగీరియాలో తిరిగి విప్లవ ప్రజ్వలన

ఎనగూ (నైగీరియా) డిసెంబర్ 16: తూర్పు నైగీరియా పట్టణమైన ఇకాంగ్‌లో ప్రజలు మళ్లీ విప్లవ చర్యలు ప్రారంభించినట్లు రూఢియైన వార్తలు వస్తున్నవి.

ఈ విప్లవచర్యలను గురించి దర్యాప్తు చేయుటకు జిల్లాపోలీసు అధికారులు 12 మంది పోలీసులతో అక్కడికి వెళ్లారట.

ఈ విప్లవ చర్యల మూలంగా అనేకమంది గాయపడ్డారని, అధికారులు చెబుతున్నారు.





## పార్లమెంట్‌కు ఆరవజార్జి సందేశం

### 'ఇండియా బిల్లు'పై బ్రిటిష్‌రాజు సంతకం

లండను, డిసెంబరు 16: "ఇండియా బ్రిటిషు కామన్వెల్తులో సమగ్ర సభ్యత్వం కలిగి ఉంటూ కూడా స్వతంత్ర సర్వతంత్ర రిపబ్లికు కావడం చారిత్రకమైన ఏర్పాటు బ్రిటిషు వలసప్రజలు క్రమంగా స్వపరిపాలన సంపాదిస్తున్నారనడానికి మరొక నిదర్శనం గోల్డుకోస్టు ప్రజలకు రాజ్యాంగరీత్యా అధికారాలు పెంచడానికి జరిగిన సూచనలు.

"అయితే ప్రపంచ శాంతిభద్రతలను కాపాడే భారం ఇంకా బ్రిటిషు సైనికుల మీదనే ఉంటున్నది. హాంకాంగు మొదలైన ప్రాంతాలలో వీరు తమ విధులను శ్రద్ధాభక్తులతో నిర్వర్తిన్నారు." అని ప్రస్తుత పార్లమెంటు సమావేశాన్ని వాయిదావేస్తూ బ్రిటిషు రాజు ఆరవజార్జి పార్లమెంట్‌కు పంపిన సందేశంలో ప్రకటించారు. ఈ సందేశాన్ని ఉభయ శాసన సభలలోనూ రాజుగారి తరఫున చదవబడింది.

బ్రిటను ఐక్యరాజ్య సమితికి మనస్ఫూర్తిగా తోడ్పడుతుంది. ప్రపంచ వాణిజ్యం స్వేచ్ఛగా అభివృద్ధి కావడానికి అన్ని దేశాలూ కృషి చేయాలి.

"బ్రిటనుయొక్క డాలరు కొరత కనడా, అమెరికాల సహాయంతో తీరవచ్చు. ఈ తరఅమెరికాతో బ్రిటను చేస్తున్న

2వ పేజి చూడుడు

## ఇండొనీషియా సంయుక్త రాష్ట్రాల తొలిఅధ్యక్షుడుగా డా. సోకర్ణో ఎన్నిక

బటేవియా, డిసెంబరు 16: ఇండొనీషియా రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ సోకర్నో, ఇండొనీషియా సంయుక్తరాష్ట్రాల తొలి అధ్యక్షుడుగా నేడు ఎన్నికైనాడు. సోకర్నో రేపు లాంఛన ప్రాయంగా అధ్యక్షస్థానమును స్వీకరిస్తాడు. ఇండొనీషియా సంయుక్తరాష్ట్రాల రిపబ్లిక్ అధినేతగా డా॥ సోకర్నోను ఇండొనీషియాలోని 16 రాష్ట్రాల ప్రతినిధివర్గాలు నేడు ఏకగ్రీవంగా ఎన్నుకొనినవి.

### ఇండొనీషియా వాణిజ్యమహాసభ

జోగ్జకార్టా, డిసెంబరు 16: ఇండొనీషియాలోని వివిధ పరిశ్రమల ప్రతినిధులతోనూ, కార్మికుల ప్రతినిధులతోనూ, ఇటీవల యిక్కడ జరిగిన వాణిజ్యమహాసభలో, ఒక ఆర్థిక మండలిని స్థాపించారు. ఈ మండలి ప్రభుత్వానికి ఆర్థిక విషయాలలో సలహా చెప్పే సంస్థగా వుండాలని ఉద్దేశం. అయితే ఈ వాణిజ్య మహాసభను ప్రభుత్వం అధికారరీత్యా గుర్తించలేదు. అందుచేత యీ ఏర్పాటు చేయబడిన సలహా మండలిని ప్రభుత్వ ఆర్థిక సలహాసంఘంగా ప్రభుత్వం సేకరించవలెనని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

ఈ మహాసభలో, ఇండొనీషియాలోని భారతీయ వర్తకులుకూడా పలువురు పాల్గొన్నారు.

ఇండొనీషియా పరిశ్రమలనూ, వాణిజ్యాన్నీ కాపాడటానికి గాను అనువుగా ప్రభుత్వం యీ దిగువ చర్యలు తీసుకోవాలని సూచించారు.

(1) ఇండొనీషియాలో, ఇండొనీషియన్ సంస్థలు తయారు చేస్తున్న వస్తువులను బయటి నుంచి దిగుమతి జరుగకుండా పరిమితం చేయాలి.

(2) యంత్రాలు వగైరా పెట్టుబడి సరకుల దిగుమతి మినహా, వినిమయ సరకులను దిగుమతి చేసుకోకుండా అరికడుతూ, నిర్మాణ యుక్తమైన దిగుమతి విధానాన్ని అమలు జరపాలి.

(3) జాతీయ పరిశ్రమలకు రక్షణ లభించేలాగు సుంకవిధానాన్ని సంస్కరించాలి.

(4) అవకాశంవున్న చోటనల్లా, దేశంలోవున్న పారిశ్రామిక వాణిజ్య సంస్థలను, ఇండొనీషియన్ సంస్థలక్రింద మార్పుచేయటానికి తగిన ప్రోత్సాహమివ్వాలి.

(5) కార్మికులకు, ముఖ్యంగా, విదేశీయుల సంస్థలలో పనిచేస్తున్నవారికి రక్షణ లివ్వాలి.

ఈ వాణిజ్య మండలి ఉపసంఘాలను, ప్రతిప్రాంతంలోనూ స్థాపించి, జూలైలో తిరిగి జరుగనున్న సమావేశం మరింత విజయవంతంగా జరిగేలాగు చేయవలసిందిగా ప్రతినిధులందరనూ హెచ్చరించారు. అలాంటి కార్యక్రమాన్ని సాగించి దేశంయొక్క ఆర్థిక స్థితిగతులను విపులంగా తెలుసుకొనటానికి వీలుకలిగించవలసిందిగా కోరారు.

## హిందూ ధర్మ క్రోడీకరణ చట్టం

### కాంగ్రెస్‌పార్టీ తీర్మానం

సెలక్టు కమిటీ నివేదిక పరిశీలించాలని నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబరు 16: కాంగ్రెసు పార్టీ ఈవేళ సోమవారంనాడు హిందూ ధర్మ క్రోడీకరణ చట్టంపై సెలెక్టుకమిటీ నివేదికను సమగ్రంగా పరిశీలించాలని నిర్ణయించింది.

అసెంబ్లీ కాంగ్రెసు పార్టీ పండిత నెహ్రూ అధ్యక్షతను సమావేశమై, రెండున్నర గంటలసేపు చర్చజరిపి ఈ నిర్ణయానికి వచ్చిందని తెలుస్తున్నది.

దీనిమీద చర్చ వాయిదా వేయ్యాలన్న తీర్మానానికి అత్యధిక సంఖ్యాకులు వ్యతిరేకించడంవల్ల వాయిదా నిర్ణయం జరగలేదట. వాయిదా వెయ్యాలన్న తీర్మానానికి ముగ్గురే అనుకూలంగా వోటు చేశారట.

సెలక్టు కమిటీ నివేదికను పరిశీలించాలన్న తీర్మానానికి 55 గురు అనుకూలంగానూ, 15 గురు వ్యతిరేకంగానూ, వోటు చేశారట

రాష్ట్రాలతో సంప్రతించాలనే సూచనలు కూడా నెగ్గలేదని తెలుస్తున్నది.

ఈ చట్టాన్ని ఒక అనధికార సంఘ పరిశీలనకు అప్పగిస్తారట. దీనిలో అనేకులు ప్రముఖులు పార్లమెంటు వారు పైవారు కూడా ఉంటారట.

సోమవారం నాటి చర్చలో పండిత నెహ్రూ పాల్గొంటారని తెలుస్తున్నది. ఈ వేళ తీసుకున్న నిర్ణయం వల్ల సోమవారం చర్చలో తీవ్రత తగ్గిపోవచ్చునని అనుకుంటున్నారు.

## కాశ్మీరు సమస్యను చర్చించడానికి భద్రతామండలి సమావేశం

### భారత-పాకిస్తాన్ ప్రతినిధుల సంప్రతింపులద్వారా పరిష్కరించడానికి ప్రయత్నం

లేక్‌సక్సెసు, డిసెంబర్ 17: అయిక్య రాజ్య సమితి తాలూకు భద్రతామండలి యందు సుమారు ఒక సంవత్సరంపైగా చర్చనీయాంశముగా ఉంటున్న కాశ్మీరు సమస్యను నేడు తిరిగి చర్చించుటకు భద్రతామండలి సమావేశమైనది. ఈ చర్చలో ఇండియా ప్రతినిధియును పాకిస్తాను ప్రతినిధియును పాల్గొనుటకు ఆహ్వానింపబడుదురు కాని వారు వోటునిచ్చుటకు వీలుండదు. భారత ప్రభుత్వము తరఫున సర్ గిరిజాశంకర బాజపాయిగారు పాకిస్తాను విదేశాంగమంత్రి సర్ మహమ్మదు జఫ్రుల్లాఖాను గారును హాజరగుదురు. కాశ్మీరు ప్రధాని షేకు అబ్దుల్లాగారు ఇండియా ప్రతినిధికి సలహాదారుగా సభకు హాజరయ్యెదరు.

ఆజాదు కాశ్మీరు ఉద్యమ నాయకుడైన సర్దారు ఇబ్రహీంఖానుగారు ప్రేక్షకులుగా యీ సమావేశమునకు హాజరయ్యెదరని తెలియుచున్నది.

కాశ్మీరు కమిటీ అధ్యక్షుడైన సీనరు హెర్నాండో సాంపసుగారు ముస్తుందుగా ఉపన్యసించి కాశ్మీరుకమిటీ (5 గురు సభ్యులతో కూడిన కమిటీ) యొక్క నివేదికను సమర్పించెదరు. కాశ్మీరులో జనవాక్య నిర్ణయము చేయుటకై పాకిస్తాను ప్రభుత్వమును ఇండియా గవర్నమెంటును సమాధాన పరచవలెనని యీ కాశ్మీరు కమిటీ ఒక సంవత్సరము ప్రయత్నించినది. కాని ప్రయోజనం లేకపోయినదని యీ కమిటీ నివేదికలో వ్రాసింది. కమిటీ మధ్యవర్తిత్వమునకు బదులుగా ఒక్క మధ్యవర్తినిగాని పరిష్కర్తనుగాని లేదా ఉభయులను ఏకకాలమందుగాని నియమించి వారిద్వారా వ్యవహారము ఫయిసలు చేయుట యుక్తమని యీ కమిటీ నివేదికలో సూచించినది.

కాశ్మీరు సమస్యకు సంబంధించిన ఉభయపక్షములతోను లోపాయికారీగా సంప్రతింపులను జరుపుటకుగాను భద్రతామండలియొక్క చర్చను వెంటనే ప్రారంభించకుండా కొన్ని దినముల తర్వాత ప్రారంభించవలెనని భద్రతామండలి అధ్యక్షుడైన జనరలు మాక్నాటను ఆలోచించుచున్నట్లుగా తెలియుచున్నది. భద్రతామండలియందు చర్చచేయవలసిన అవసరములేకుండానే ఇండియా పాకిస్తాను ప్రతినిధులతో అంతరంగికంగా మాట్లాడుట మూలంగానే సంతృప్తికరమైన సమాధాన పద్ధతికి ఉభయులను సమ్మతింపజేయవచ్చునని మాక్నాటనుగారు ఊహించుచున్నారు.

## విద్యా సంస్థల భవనాల స్వాధీనపు బిల్లు

### అసెంబ్లీలో చర్చ

మదరాసు, డిసెంబరు 17: మదరాసు అసెంబ్లీ నేడు స్పీకరు శ్రీ శివషణ్ముగం పిళ్ళె అధ్యక్షతను సమావేశమైనప్పుడు విద్యాసంస్థల భవనముల స్వాధీనపు బిల్లుపై చర్చ జరిగింది.

జనాబ్ హమీద్‌ఖాన్ మాట్లాడుచూ విద్యాసంస్థల భవనములను ఒక సంవత్సరముపాటు స్వాధీనపరచుకొని నిర్వహణ లోపములను నివృత్తి చేయగలదాయనుకొనుట పొరపాటని సంశయమునిరి. సాధ్యమైనంతవరకు స్వాధీనపరచుకున్న వ్యవస్థను అవ్యవస్థ ఏవర్గమునకు ఏ మతమునకు సంబంధించిన వారిచేతకైనని నిర్వహించబడగలదనేవిషయము కూడ జరిగే పనికాదనిరి. అల్ప సంఖ్యాకులు, కాతలిక్కులు ఈ బిల్లును వ్యతిరేకించిరి. కనుక ఈ బిల్లును మంత్రిగారు ఉపసంహరించుకొనవలెననిరి.

ఈ సమయమున డిప్యూటీ స్పీకరు శ్రీమతి అమ్మన్న రాజాగారు అధ్యక్షత వహించిరి.

బేగం అమినుద్దీన్ మాట్లాడుచూ ప్రజాభిప్రాయమును గమనించి అల్ప సంఖ్యాకులు, కాతలిక్కులలో ఆందోళన కల్గించిన ఈ బిల్లును ఉపసంహరించవలెననిరి.

శ్రీ కె. భాష్యంగారు మాట్లాడుచూ సరిగా నిర్వహించబడిన పాఠశాలలను విద్యార్థుల క్షేమం దృష్ట్యా విద్యా సంస్థలను స్వాధీన మొనర్చుకొనుట ఉద్దేశ్యమై యున్నదనిరి, అందువలన ఎవరూ ఏ విధముగా భయపడ నవసరములేదనిరి. అసంతృప్తి అనుమానమునకు తావునిచ్చే షరతులు తీసివేయబడినవి. అందువలన బిల్లును ఆమోదించవలెననిరి. అంతటితో సభ ఫలహారమునకు వాయిదాపడెను.

## సోవియట్ రష్యా రాజధానికి కమ్యూనిస్టు చైనాప్రధాని ఆగమనం

### మావ్ సీటుంగ్‌కు మాస్కో స్టేషన్‌లో మాలటావ్ ప్రభృతుల ఘన స్వాగతం

లండన్, డిసెంబరు 16: చైనాకమ్యూనిస్టు నాయకుడు మావ్ సీటుంగ్ ఈవేళ మాస్కో వచ్చారని మాస్కో రేడియో ఈ వేళ రాత్రి ప్రకటించింది.

మావ్ సీటుంగ్‌కు, ఉపప్రధానమంత్రి మాలటావ్, ఉప విదేశాంగమంత్రి ఆంద్రీ గ్రోమికోవ్‌లు కలిసి స్వాగతం ఇచ్చారని కూడా మాస్కో రేడియో పేర్కొన్నది. వీరితో మార్షల్ బుల్గానిన్‌కూడా స్టేషనుకు వచ్చారట.

మావ్ సీటుంగ్‌కు, చెకోస్లవేకియా, హంగేరియా, బల్గేరియా, రుమేనియా, మంగోలియా, ఆల్బేనియా, పోలండు, తూర్పు జర్మనీ రాయబారవర్గాలు, కమ్యూనిస్టు చైనా రాయబారికూడా స్వాగతం ఇచ్చారని తెలుస్తున్నది.

మాస్కో స్టేషనువద్ద సైనికులు మావ్ సీటుంగుకు సైనికాభివందనం చేశారు. స్టేషనులో అంతటా రష్యా చైనా పతాకాలు అలంకరించారు.

స్టేషనువద్ద స్వాగత సమయంలో, "పరస్పర సౌహార్దం పెంపొందించుకోవడము, శాంతి స్థాపనకై పోరాటం సాగించడము, చైనా రష్యాల ఆదర్శాలని మావ్ సీటుంగ్ అన్నారు.

మావ్ సీటుంగ్ ఇంకా ఇల్లాగ అన్నారు. "అనేక సంవత్సరాలనించి రష్యా ప్రజలు, ప్రభుత్వము, చైనాప్రజల స్వాతంత్ర్యానికి ఎక్కువగా తోడ్పడ్డారు. కష్టసమయంలో రష్యా ప్రజలు చేసిన సహాయం చైనా ప్రజానీకం ఎన్నటికీ మరిచిపోరు."

## హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లు: ఢిల్లీలో అరెస్టులు

న్యూఢిల్లీ, డిసెంబరు 15: హిందూధర్మశాస్త్ర క్రోడీకరణబిల్లుకు ప్రాతికూల్యం చూపుతూ, కౌన్సిల్ భవనంయెదుట ప్రదర్శన జరిపినవారిలో పోలీసులు అరెస్టు చేసిన 12 మంది యివాళ జామీనుమీద విడుదలైనారు.

## 1950 ఏప్రెల్‌నుండి హైద్రాబాదులో నిజాంపోస్టల్ విధానం రద్దు

హైద్రాబాద్, డిసెంబరు 16: 1950 ఏప్రిల్‌నుండి హైద్రాబాద్ సంస్థానంలో నిజాంపోస్టల్ విధానం రద్దుచేయబడుతుందని నేడు అధికారపూర్వకంగా తెలియవచ్చింది. పోస్టుకార్డు, కవరు, మొదలైనవాటిధరలు ఇండియాలో ఉన్నట్లుగానే ఏర్పాటు చేయబడుతవి పోస్టు టెలిగ్రాఫ్ డైరెక్టరు యాజమాన్యాన హైద్రాబాద్ సంస్థానం ఒకచిన్న సర్కిలుగా ఏర్పాటు చేయబడుతుంది. హైద్రాబాద్ ప్రభుత్వ టెలిఫోనులు, స్థానిక రేడియో స్టేషన్‌కూడ ఏప్రెల్‌నుండి భారతప్రభుత్వ స్వాధీనంకిందకు వస్తవి. హైద్రాబాద్ రేడియో స్టేషను ఆలిండియా రేడియో ప్రత్యక్షనిర్వహణకిందకు తీసుకోబడుతుందా, లేక భారతప్రభుత్వయాజమాన్యాన ప్రత్యేక కేంద్రంగా నడపబడుతుందా అన్న విషయంపై యింకా నిర్ణయం జరుగలేదు.

## బొంబాయి, హైద్రాబాదుల్లోని "లంకలు"

బొంబాయి, డిసెంబరు 15: బొంబాయి రాష్ట్రంలోను, హైదరాబాదు సంస్థానంలోను ఉన్న "లంకలను" విలీనం చేసుకోవచ్చుననే సూత్రాన్ని బొంబాయి మంత్రివర్గం అంగీకరించినట్లు నేడు తెలిసింది.

ఈ సూత్ర ప్రకారం 100 హైదరాబాదు గ్రామాలను బొంబాయి రాష్ట్రము, దాదాపు 95 బొంబాయి గ్రామాలను హైదరాబాదు సంస్థానము తమలో విలీనం చేసుకుంటాయి. ఆయా గ్రామాల మొత్తం వైశాల్యాలు దాదాపు సరిసమానంగానే వున్నాయి.

అయితే పెద్ద పెద్ద ప్రదేశాలకు ఈసూత్రం వర్తించదు. ఉదాహరణకి, షోలాపూరు జిల్లాకు చెందిన బార్శి తాలూకా, అహమ్మద్ నగర్ జిల్లాకు చెందిన జమ్ఖెడ్ మహల్ హైదరాబాదు సంస్థానంలో వున్నప్పటికీ వాటిని రాష్ట్రమే పరిపాలిస్తుంది.



## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ చతుర్దశి
1949 సం॥ డిసెం॥ 18 ఆదివారం
అ॥చతుర్దశి రా 3-5 అనూ సా 7-7 వర్జ్యం రా 12-16 ల 1-43 వ.
బ॥ అమా॥ డిసెం॥ 19 సోమవారం
సో॥ అమా॥ రా 12-24 జ్యే సా 5-5 వర్జ్యం రా 12-31 ల 2-0 వ.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ మార్గశిర బ॥ చతుర్దశి
ఆదివారం

## ఫ్రెంచి ప్రభుత్వ వైఖరి

భారతదేశములో తమ పరముగ నున్న భూభాగములపై తన అధికారాధిపత్యములను వదులుకొనుటకు ఫ్రెంచి ప్రభుత్వము సిద్ధపడనంతవరకు, ఆ ప్రాంతముల భవిష్యత్తు విషయమై ప్రజాభిప్రాయ సేకరణకు జరుగు ఏర్పాట్లపై ఫ్రాన్సు, భారతప్రభుత్వములకు సమాధానము కుదురుట దుస్సాధ్యము. జనవాక్యము ననుసరించి చంద్రనగరమును భారత ప్రభుత్వవశము చేయుటకు ఫ్రెంచి ప్రభుత్వము ఇంతవరకు సిద్ధపడలేదు. జనవాక్యనిర్ధారణ జరిగి ఆరుమాసములు దాటినను అధికారమును భారతప్రభుత్వమునకు దఖలుపరచుటకు ఫ్రాన్సు సమ్మతింపకపోవుటేగాక, మొదటి ఒప్పందమునకు విరుద్ధముగ చంద్రనగరమునందు ఏదో రూపమున తమ యధికారమును నిలుపుకొనుటకు ప్రయత్నించుచున్నట్లు ఇటీవలి సంఘటనలవలన స్పష్టమైనది.

చంద్రనగరమునందలి ఫ్రెంచి అధికారులు నగరమును భారత ప్రభుత్వమునకు వప్పగింత పెట్టుటకు తమ ప్రభుత్వము సిద్ధముగ నున్నప్పటికిని భారత ప్రభుత్వము త్వరపడుటలేదని, ఫ్రెంచి ప్రభుత్వము ప్రతిపాదించిన ఒడంబడికను భారతప్రభుత్వ మంగీకరించుచేతడవుగ తాము నగరము నుండి వైదొలగెదమని ప్రకటించిరి. కాని చంద్రనగరము అప్పగింతలో కాలహరణమునకు ఫ్రెంచి ప్రభుత్వ విధానమే కారణమని, భారతప్రభుత్వమునకు సమ్మతముగాని ఒడంబడికను ఫ్రెంచిప్రభుత్వము ప్రతిపాదించినపుడు తాము అంగీకరింపజాలమని భారత ప్రభుత్వ విదేశాంగశాఖ చేసిన ప్రకటనను బట్టి భారతదేశము నందలి ఫ్రెంచి భూభాగముల సమస్యా పరిష్కారమునకు ఫ్రెంచిప్రభుత్వ వైఖరే కారణమని స్పష్టమైనది.

చంద్రనగరమున జనవాక్యము తమకు ప్రతికూలమైనదని ఇతర భూభాగములందు అట్టి 'ప్రమాదము' జరుగకుండ చూచుకొనుటకు ఫ్రెంచిప్రభుత్వము పూర్వపు ఒడంబడికను భగ్నము చేయు చర్యలను ప్రారంభించిరి. డిసెంబరు మాసములో ప్రజాభిప్రాయ సేకరణ జరుగునని ముందు ప్రకటించితిరి గి ఆ తేదీని మార్చి, వోటర్ల జాబితాల నిపుడు సవరించి 1950 మార్చి మాసములో పున జనవాక్య నిర్ధారణను పూర్తిచేయుటకు ఫ్రెంచి అధికారులు తొందరపడుచున్నట్లు కన్పించుచున్నది. మొత్తము వోటర్లలో నూటికి అరువదిమంది చొప్పున అయినను జనవాక్య నిర్ధారణ కలాపమునందు పాల్గొనకపోయిన అది చెల్లనేరదని షరతు విధించి, వ్యవసాయదారులు పూర్తిగ తమ పనులలో నిమగ్నులై యుండు ఫిబ్రవరి, మార్చి మాసములలో జనవాక్య నిర్ధారణ జరుప నిర్ణయించుటలోనే ఫ్రెంచి ప్రభుత్వ ఉద్దేశ్యము వెల్లడియైనది.

ఫ్రెంచి ప్రభుత్వము భారత దేశమునందలి నాలుగు ప్రాంతములపై తనయాధిపత్యమును శాశ్వత ఫ్రాన్సు-భారత మైత్రికంటె ఎక్కువగ భావించుచుండినంతకాలము ఈ సమస్య పరిష్కారము కాజాలదు. ఇట్టి విధానమువలన భారతదేశముగాక, ఫ్రాన్సే ఎక్కువగ నష్టపడవలసి యుండును. ఎప్పటికైనను, పుదుచ్చేరి, కారైకాల్, మాహే, యానాములు భారత దేశాంతర్భాగములు గాకతప్పదు. సంశ్లిష్ట భారతప్రభుత్వ ప్రాంతములందలి ప్రజలు సంపూర్ణ స్వాతంత్ర్యమును అనుభవించుచు పరిపాలనయందు భాగస్వామ్యమును పొందుచుండ, ఫ్రెంచి భూభాగముల ప్రజలు వలసప్రాంత ప్రతిపత్తిని అనుభవించుచు తృప్తిపడి యుండజాలరు. సకాలములో ఫ్రెంచి ప్రభుత్వము ముందుగతిని తెలుసుకొనక ఇప్పటి విధానమునే అనుసరించిన భారతదేశ మైత్రిని కోల్పోవుటేగాక, ఈ నాలుగు ప్రాంతములపై తమ యధికారమును వదులుకొనవలసివచ్చును.

## జనవరి 26 న ఆంధ్ర రాష్ట్రావతరణ సమస్య

కళా వెంకట్రావుగారి ప్రకటన

విజయవాడ, డిశంబరు 16 : ఆంధ్ర రాష్ట్రపరిపాలనా కేంద్రమును దేనిని నిర్ణయించటమన్నదే మద్రాసు ప్రభుత్వం నియమించిన విభజనసంఘంవారి నెదుర్కొంటున్న తక్షణసమస్య అని కాంగ్రెసు కార్యదర్శి, విభజనసంఘసభ్యులు అగు కళా వెంకట్రావుగారు నిన్న ఇక్కడ పత్రికాప్రతినిధులతో ప్రసంగించుచూ చెప్పారు.

ఆంధ్రరాష్ట్ర తక్షణనిర్మాణానికి మద్రాసుప్రభుత్వం ఎంతగానో కృషి చేస్తున్నదనీ, యీ సందర్భంలో అవసరమగు ఆఫీసర్లను యీపనికి నియమించిందనీ వెంకట్రావుగారన్నారు. విభజన సంఘం నియమించిన ఉపసంఘాలు నిర్వర్తించవలసిన కార్యభారమంతో ఉన్నదనీ, వారు చురుకుగానే పనికొనసాగిస్తున్నారనీ అన్నారు. కేంద్రప్రభుత్వంవారు పంపిన ప్రశ్నావళికి సమగ్రమైన సమాధానాలు తయారుచెయ్యటానికి 1950 ఏప్రిల్ వరకు పడుతుందన్నారు. అయితే మదరాసు ప్రభుత్వం చేస్తున్న కృషినిబట్టి, తక్షణమే రాష్ట్రం ఏర్పడే అవకాశం ఉన్నదని నమ్ముతున్నామన్నారు.

భారత రిపబ్లిక్ అవతరణతో పాటు ఆంధ్రరాష్ట్రాన్ని కూడ నిర్మించటానికి భారత ప్రభుత్వమే నిర్దిష్టమైన చర్య తీసుకోవలసియున్నదన్నారు.

## కర్ణాటక ఏకీకరణ సమితి

బళ్లారి తాలూకాలనుగూర్చి ప్రధానమంత్రికి తంతి

హుబ్లీ, డిసెంబరు 15 : కర్ణాటక యేకీకరణ మహాసమితి ప్రధాన కార్యదర్శి అందానప్ప దొడ్డమేటిగారూ, కర్ణాటక వాణిజ్య మహాసభ కార్యదర్శి సి. యస్. కంపన్నగారూ కలిసి, పటేలు నెహ్రూలకు ఒక తంతివార్త పంపారు. కొన్ని తాత్కాలిక యేర్పాటుగా బళ్లారిజిల్లా నంతా ఆంధ్రరాష్ట్ర భాగంగా వుంచాలని మద్రాసు ప్రధాని కుమారస్వామి రాజాగారు చేసిన ప్రసంగంపట్ల తమ అసమ్మతిని తెలియజేశారట. అలా జరిగితే చాలా కల్లోల పరిస్థితి యేర్పడుతుందంటూ వాళ్లు తెలియజేశారట.

## మునిపల్లె మార్కెటింగ్ కో ఆపరేటివ్ సొసైటీ

పొన్నూరు, డిసెంబరు 13 : మునిపల్లె మార్కెటింగ్ కోఆపరేటివ్ సొసైటీ, డైరెక్టరులు, నిన్నటిదినం, సమావేశమై, దాసరి వెంకట సుబ్బారావుగారిని అధ్యక్షులుగను, ఎ. తిరుపతిరాయుడుగారిని, ఉపాధ్యక్షులుగను యెన్నుకొన్నారు.

యేడుగురు డైరెక్టరులకు గాను, ఆర్గురు హాజరయినారు. (స్వ. వి.)

## మద్యనిషేధ సవరణ బిల్లు

### అసెంబ్లీ ఆమోదం

మదరాసు, డిశంబరు 16 : అసెంబ్లీ ఫలహారానంతరము సమావేశమైనప్పుడు న్యాయమంత్రి శ్రీ కె. మాధవమీనన్ మదరాసు మద్యనిషేధ మూడవ సవరణ బిల్లును ప్రతిపాదించిరి.

సైనికోద్యోగులకు బిల్లులోని షరతులకు మినహాయింపు ఇచ్చుటే గాక, వారు మద్యమును వుంచుకొనుటకు, వాడుకొనుటకు లైసెన్సు ఇచ్చు అధికారము పొందుట ఈ బిల్లు యొక్క ఉద్దేశ్యము.

చర్చ ఏమీలేకుండా బిల్లు అసెంబ్లీలో అంగీకరించబడెను.

### క్షయ నివారణ కేంద్ర భవనముల బిల్లు

ప్రజారోగ్య మంత్రి డా॥ టి. యస్. యస్. రాజన్ క్షయ నివారణ కేంద్ర భవనముల కంట్రోలు బిల్లును ఆమోదించవలెనని ప్రతిపాదించిరి.

క్షయ శానిటోరియం భవనముల రెక్విజిషను చట్టం నిర్వహణలో వచ్చిన లోపములను సర్దుబాటు చేయుటకు ఈ బిల్లు ఉద్దేశించబడెను. ఈ బిల్లును చర్చలేకుండానే అసెంబ్లీ ఆమోదించెను.

### మదరాసు విద్యాలయముల ఆస్తి స్వాధీనపు బిల్లు

విద్యామంత్రి కె. మాధవ మీనన్ విద్యాలయ భవనములను ఆస్తిని స్వాధీనము చేసుకొనుటకు సంబంధించినబిల్లును సెలక్టు కమిటీ సవరించినరీతిని ఆమోదించవలెనని ప్రతిపాదించిరి.

బిల్లు ఉద్దేశ్యములను వివరించుచూ విద్యాభంగము రాకుండా నిర్ణీతకాలము వరకు విద్యాసంస్థల భవనములను స్వాధీనమొనర్చుకొనుటయే ఉద్దేశ్యమని యు, అయితే విద్యాభ్యాస సంవత్సరం ముగియువరకు అవసరమైతే మరొక సంవత్సరము తప్ప అంతకుమించి భవనములను స్వాధీనపరచుకొనుటకు వీలులేదనిరి. అందువలన శాశ్వతముగా భవనములను స్వాధీనపరచుకొనుట ప్రభుత్వఉద్దేశ్యము గాదని తెలియగలదనిరి.

శ్రీ వైన్ మాట్లాడుచు ఈ బిల్లు అనవసరమనిరి. విద్యాభివృద్ధికి వ్యక్తులప్రోత్సాహము చాల అవసరం. మిషనరీ సంస్థలను అల్పసంఖ్యాకుల సంస్థలను అణచివేయుటకు ఈ బిల్లు ఉద్దేశించుచున్నదని పలువుగ అభిప్రాయపడుచున్నారు. ప్రభుత్వమునకు ఇష్టములేని విద్యాసంస్థలను ఎత్తివేయుటకు ఈ బిల్లు ఉపయోగపడుననిరి.

జనాబ్ అన్వర్ సాహెబు మాట్లాడుచు మిషనరీలు విద్యాలయములద్వారా మతప్రచారము సాగించుచున్నారనే అనుమానము వలన మెజారిటీ మతమువారు ఈ బిల్లును తీసుకొని వచ్చినారనీ, సెలెక్టు కమిటీలో కొన్ని సవరణలు జరిగినా అనుమానము తొలగలేదనిరి. బిల్లువర్తించువారు ప్రభుత్వ ఉద్దేశ్యములను శంకించుచున్నారనిరి.

శ్రీ యస్. యస్. వరదాచారిగారు సక్రమముగా వ్యవహరించనట్టి విద్యా సంస్థలమీద ప్రభుత్వము నిజముగా సరియైన విధమున శక్తివంతముగా కంట్రోలులో చలాయించగలిగితేనే అధికారమును తీసుకొనవలెనుగాని అలాకాకుండా అట్టిది సాధ్యపడని పక్షంలో ఒక శాసనం చేసి నంతమాత్రమున ప్రయోజనం ఉండదు గనుక యీబిలువిషయమై తిరిగి పైరివేటు సంస్థల వారితో పునరాలోచన గావించుట మంచిదనిరి.

ఫ్రాంథెజ్ గారు విద్యాసంస్థలు సరిగా వ్యవహరించునట్లు చేయటానికి కావలసిన అధికారము ప్రభుత్వమునకు యిదివరకే ఉన్నదనియు, అట్టి అధికారములను తీసుకొనుటకు యీ శాసనంచేయుట అనవసరమనియు చెప్పి బిల్లును ఎదిరించిరి.

శ్రీ పట్టాభిరామన్ గారు సక్రమముగా నిర్వహింపబడని విద్యాసంస్థలను స్వాధీనపరచుకొని నడుపుటయే యీబిల్లు ఉద్దేశ్యముగాని అన్యమత విద్యాసంస్థలయెడ విచక్షణచూపుటకు కాదనిరి. శ్రీ కంద స్వామిపిళ్ళగారు బిల్లును బలపరచిరి. అబ్దుల్ హమీద్ ఖాన్ గారు ప్రభుత్వమువారు బిల్లును ఉపసంహరించితే రాష్ట్రమున విద్యాభివృద్ధికి మేలు చేసినవారగుదురనిరి.

ప్రతిపక్షనాయకుడు మహ్మద్ ఇస్మాయిల్ గారు యీబిల్లు ప్రయివేటువిద్యాసంస్థలవారిని, అట్టిసంస్థలనిర్వహణ కార్యములో ఉత్సాహంలేకుండా చేయుననిచెప్పి బిల్లును ప్రభుత్వము ఉపసంహరించవలెననియు కోరిరి.

అబ్దుల్ హమీద్ ఖాన్ గారు బిల్లును ఎదిరించిరి.

అంతటితో అసెంబ్లీ సభ మరుసటిరోజు మధ్యాహ్నం 12 గంటలకు వాయిదా పడెను.

## చెరకు ఉత్పత్తిదారుల సభ

### ఖర్చులు తగ్గించాలని మంత్రిగారి సలహా

మదరాసు, డిశంబరు 16 : "ఉత్పత్తిదారులు క్రొత్తపద్ధతుల ననుసరించి చెరకును ఎక్కువగ పండించి, ఉత్పత్తి ఖర్చులు తగ్గించినగాని చక్కెరధర తగ్గదు. చెరకు పండించువారి లాభం, ఫ్యాక్టరీయజమానులలాభాలేకాక, చక్కెర ఉపయోగించే ప్రజల కష్టనష్టాలనుగూడ ప్రభుత్వం వారు గమనించాలి. తినేవారికి ప్రత్యేక సంస్థలు ఆందోళనచేసే అవకాశాలులేవు." అని వ్యవసాయశాఖ మంత్రి ఎ. బి. షెట్టిగారు నిన్న ద. ఇ. చెరకు ఉత్పత్తిదారులసభ ప్రారంభోపన్యాసము నొసంగుచును డిరి. మన చెరకు పరిశ్రమ ప్రపంచంలో యితర దేశాలతో పోటీ నిలచుటకై ఉత్పత్తిదారులు తంటాలు పడవలెను.

"17 సం॥ ల నుండి రక్షణ పొంది చెరకు పరిశ్రమ మనదేశంలో బాగా అభివృద్ధి పొంది నేడు పరిశ్రమలలో రెండవ స్థానమలంకరించుచున్నది. రూ 35 కోట్ల పెట్టుబడి గల్గి $1\frac{1}{2}$ లక్షల పని వారిని నియమించినది. మొత్తం ఇండియాలో 40 లక్షలఎకరాల చెరకుపంట184 ఫ్యాక్టరీలు ఉండగా, మదరాసులో 2 లక్షల ఎకరాలు పది ఫ్యాక్టరీలు మాత్రం కలవు. బొంబాయిలో మనిషి ఒక్కంటికి 19 పౌనులు చక్కెర వాడుక అగుచుండగా మదరాసులో 4 పౌనులు మాత్రమే వాడుకగుచున్నది. యుద్ధానికి పూర్వం 8 లక్షల టన్నులు వాడుక అగుచున్న చోట, యిప్పుడు 11 3/4 లక్షలు వాడుక అగుచున్నవి. అయినా చక్కెర దర మాత్రం యితర దేశాలకన్న మనదేశంలో ఎక్కువగా నుంది. కనుక చెరకు ధర తగ్గించుటకు అందరు తోడ్పడవలెను. చిన్న రాష్ట్రంలో ఉత్పత్తి తక్కువయినా కోయంబత్తూరు చెరకు గడలు ఎక్కువ చక్కెర నివ్వగలవు కనుక వాటిని యితర రాష్ట్రాలకేగాక ఆస్ట్రేలియాకుకూడ పంపబడినవి.

చక్కెర కొరతవలన బెల్లంధర పెరిగి ఎక్కువగ చెరకు గడలు అందు కుపయోగపడుచున్నవి. బెల్లంవాడే పేద ప్రజలకిది కష్టంగానుంది. అందుచే కొన్నిచోట్ల చెరకును బెల్లం ఉత్పత్తికి వాడకుండా నిషేధింపవలసి వచ్చుచున్నది. ఉత్పత్తిదారులు ఎక్కువ ఉత్పత్తి చేయుటకు పాటుబడవలెనని మంత్రిగారు హెచ్చరించిరి.

ఇ. వి. సుందరరెడ్డిగారు, మంత్రిగారికి అతిథులకు స్వాగత మొసగిరి. సి. కె. నాగరాజనుగారు సభకు అధ్యక్షత వహించిరి.

### తీర్మానాలు

సభలో యీ దిగువ తీర్మానములు అంగీకరించబడెను :-

ప్రభుత్వంవారు 1949-50 సం॥ నకు నిర్ణయించిన చెరకు ధరలను సవరించాలి. అన్ని ఫ్యాక్టరీలకు ఒకే ధర ఉండాలి. పుగలూరు ఫ్యాక్టరీకి రవానా సౌకర్యాలు యివ్వాలి. రైలు రవానా చార్జీలు తగ్గించాలి. బెల్లం ఉత్పత్తిని నిరోధించరాదు.

చక్కెర సలహాసంఘాలను ప్రతిఫ్యాక్టరీకి ఒకటినియమించి వాటిలో చెరకు ఉత్పత్తిదారులకు బెల్లంఉత్పత్తిదారులకు ఎక్కువప్రాతినిధ్యం యివ్వాలి. రయితుల వద్ద నిర్బంధంగా ఋణంగా కొనరాదు.

ఫ్రెంచి ఇండియానుండి చెరకు దిగుమతి చేసుకొనుటకు అవకాశాలు ఎక్కువ చేయాలి.

1950 ఏప్రిలు తరువాత చెరకుధర మార్చుటకు అవసరంలేదు. కనుక అంతకు పూర్వం ఉన్నధరలే తరువాతకూడ నుండవలెను. అని ఇండియాప్రభుత్వమునకు సూచించుచు తీర్మానించబడెను.

## త్వరలోనే జపాన్ సంధి ఒడంబడిక

### చక్రవర్తి హిరోహిటో విశ్వాసం

టోకియో, డిసెంబరు 15 : త్వరలోనే జపానుకు సంధి ఒడంబడిక లభించగలదని తను ఆశిస్తున్నట్లు, జపాను చక్రవర్తి హిరోహిటో పార్లమెంటు సమావేశం ప్రారంభిస్తు అన్నాడు.

పార్లమెంటు ఏడవ సమావేశాన్ని లాంఛన ప్రాయంగా ప్రారంభిస్తూ "మన మిక అంతర్జాతీయ సమాజాలలో తిరిగి ప్రవేశించగలమని నమ్మకం పెట్టుకోవచ్చు; మిత్రమండలి సహాయంతో జపాను ఎంతో పురోభివృద్ధి సంపాదించింది. మాతృభూమిని పునర్నిర్మాణం చేయవలసిన బాధ్యత పార్లమెంటుపై నున్నది.

జపాను నూతన రాజ్యాంగంయొక్క లక్ష్యము శాశ్వతశాంతి. ప్రజాస్వామ్యమూ తిరుగులేని రాజ్యాన్ని స్థాపించుటకు జపానీయులు ఎంతో కష్టపడ్డారు, అని చక్రవర్తి హిరోహిటో అన్నాడు.

## "దేశానికి నాయకులను సమకూర్చే బాధ్యత విశ్వకళాపరిషత్తులదే"

### ఆంధ్రవిశ్వకళా పరిషత్ సభలో రాజాజీ ప్రసంగం

విశాఖపట్నం, డిసెంబరు 16 : "ఏదేశమైనా, ఇదీ నా సంపద అని సగర్వంగా చెప్పకోగలిగినది ఆ దేశీయుల మేధాశక్తి, విధ్యుక్త కర్తవ్యంపట్ల వారికి గల భక్తియుతమైన దీక్ష—ఇవేసుమా!" అని గవర్నరు జనరలు రాజాజీ నేటి సాయంత్రం ఆంధ్రవిశ్వకళాపరిషత్ అధ్యాపకుల, విద్యార్థుల సమావేశంలో ఉపదేశించారు.

రాజాజీ మాట్లాడుతుండగా, విద్యార్థులు సావధానంగా వింటూ అద్భుతమైన క్రమశిక్షణ ప్రదర్శించారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానంతరం పైనబడే గురుతర బాధ్యతలనుగూర్చి రాజాజీ విద్యార్థులకు హితోపదేశమిచ్చారు.

గవర్నరు జనరలు విశ్వకళాపరిషత్తుకు రాగానే ప్రోఛాన్సెలరుగారు, వైస్ ఛాన్సెలర్ డా॥ వి. ఎస్. కృష్ణగారు స్వాగతమిచ్చారు. అధ్యాపకులతో కలిసి టీ సేవించినపిదప రాజాజీ సభలో ప్రసంగించారు. రాజాజీ ఇదివరలో ఒకసారి ఇక్కడకు వచ్చారు.

"దీర్ఘకాలానంతరం మళ్ళీ మిమ్ముకలుసుకోగలిగినందుకు మహదానందం పొందుతున్నాను. మీచిరకాలవాంఛ అయిన ఆంధ్రరాష్ట్రం రానున్న తరుణంలో మీనడుమకువచ్చి నిలబడటం, మీహర్షపూర్ణహృదయాల పొంగును చూడగలగటం నిజంగా నా అదృష్టం. ఈ క్రొత్తరంగంలో మీకు శుభం చేకూరుగాక అని నా ఆశీర్వాదం. (చప్పట్లు) ఫలసిద్ధిపొందిన ప్రతి వాంఛవనుక మహత్తరబాధ్యతలు కాచుకొనివుంటాయి. కాని ఈ మాటను ఎందరో, ఎన్నిసార్లో తిరిగితిరిగి ఉచ్చరించటంవలన దాని అసలు అర్థం మాటుపడుతున్నది. ముఖ్యంగా పరాయి భాషలో ఈ ముక్క చెబుతూ, అవసరమైన దానికంటే ఎక్కువసార్లు అనటంవల్ల అది అర్థవిహీనవాక్యం అవుతున్నది. కాని ఈ వాక్యార్థమును సంపూర్ణంగా గ్రహించవలసిందని మిమ్ము కోరుతున్నాను.

ఒక క్రొత్తగౌరవం, క్రొత్తప్రతిపత్తి వస్తే, దానితోపాటు క్రొత్త బాధ్యతలు కూడ వస్తాయి. ఈ వాక్యాన్ని ఆంధ్ర ప్రజలనందరినీ ఉద్దేశించి అమోఘముగానే నవటంలేదు. ఇక్కడ సమావేశమైన మీకు మాత్రమే ఈ ముక్కలు చెబుతున్నాను.

విశ్వకళా పరిషత్తులంటే పరిశోధన చేసి, క్రొత్త విజ్ఞానాన్ని సంపాదించి, ఆ విజ్ఞానాన్ని క్రొత్తగా వచ్చే వారికి అందించే స్థలములు. చారిత్రకంగాను, రాజకీయంగాను చూస్తే మనదేశంలో విశ్వకళా పరిషత్తులు వందలకొలదీ దేశనాయకులకు తర్ఫీదు నిచ్చే స్థలములుగా తయారైనవి. మీ క్రొత్త రాష్ట్రానికి క్రొత్త నాయకులు కావాలి. నాయకులంటే వార్తాపత్రికల్లో ఫోటోలుపడే ఆసామీలు కారు. నాయకులు ప్రతిగ్రామానికి, జిల్లాకు, పట్టణానికి కావాలి. ప్రతి వ్యవసాయక్షేత్రానికి, కర్మాగారానికి, జీవితంలోని ప్రతిరంగానికి నాయకులు అవసరం. ఈ కాలంలో నాయకత్వంలేనిదే నాగరికత లేదు. ఇండియావంటి దేశానికి విశ్వకళాపరిషత్తులనుండి కాకపోతే నాయకులెక్కడి నుంచివస్తారు? మనకిప్పుడు ఋషులు లేరు. ఆశ్రమాలులేవు. మన ఋషులు మన వైస్ ఛాన్సలర్లే. అఖరకు మీ ప్రో ఛాన్సెలరుకూడా గొప్ప పండితుడుకావటం మీ అదృష్టం. సాధారణంగా ఛాన్సెలరు, ప్రో ఛాన్సెలరు నామమాత్ర అధికారులు. కాని మీకు ఒకరాజా సాహెబ్, పండితుడు, డబ్బిచ్చే దాత ప్రో ఛాన్సెలరుగా ఉన్నాడు. అంటే ఆయన మీ విశ్వకళాపరిషత్తుకు తల్లీతండ్రి కూడాను. (నవ్వులు)

పూర్వకాలపు ఋషులు, వారి ఆశ్రమాలుపోయి వాటిస్థానంలో విశ్వకళాపరిషత్తులు వచ్చాయని చెప్పాను. మీ నూత్న రాష్ట్రానికి కావలసిన నైతిక, ఆధ్యాత్మిక నాయకత్వం ఈ పరిషత్తునుంచే రావాలి. మీవారు రాజధానిని ఎక్కడనైనా కట్టుకోవచ్చు. ఈపరిషత్తుమాత్ర మీరాష్ట్రానికి ఆధ్యాత్మిక రాజధాని అవుతుంది. కనుక ఈబాధ్యతను మీరు బాగా గుర్తించాలి.

డా॥ రెడ్డిగారి మార్గదర్శిత్వం క్రింద మీపరిషత్తులో సమర్థులైన అధ్యాపకులు, విద్యార్థులు చేరారు. కాని మనం కష్టపడి మనలక్ష్యంపూర్వ భక్తితో పనిచేస్తేనే కాని కృతకృత్యులం కాలేము. గొప్ప పనులన్నీ భక్తివల్లనే సాధ్యమౌతాయి. మనస్సు భక్తిపూరితమై ఉన్న యెడలనూ దురాశకు ఆశాంతికి లోనుగాదు. బాధ్యతపై భక్తి దేవునిపై భక్తి వంటిదే. మీ పని పై భక్తితో వుంటే అది భగవత్పూజతో సమానమైనదవుతుంది. కనుక ఈ పరిషత్తులోని విద్యార్థులు, అధ్యాపకులు తాము భగవంతుని ఎదుటవున్నట్లు దేవాలయంలో వున్నట్లు భావిస్తూ, భక్తి భావంతో పని చెయ్యాలి. పరిపాలనలో గాని, సంఘంలో గాని, ఏ ఇతర పనిలో గాని తాత్కాలిక కష్టాలు వస్తే మీరు ఆందోళన పడకండి. మనకొక గొప్ప భవిష్యత్తు ఉన్నది. దానిని భక్తి భావంతో సాధించాలి. చాలినంత డబ్బు లేదనే బెంగ పెట్టుకోకండి. ఎన్ని చిక్కులైనా భక్తి వల్ల పరిష్కారమౌతాయి. అచిరకాలంలో ఈ సభలోని యువకులు మనదేశం, మనరాష్ట్రం ఉన్నతస్థితికి రాటటాన్ని స్వయంగా చూడగలరు. కొందరు నిరాశకు నిరుత్సాహానికి తావిస్తున్నారు. కాని అది నిర్హేతుకం. మీబాధ్యతలను పట్టుదలతో శిరసావహించగలరని ఈ సభలో ప్రదర్శితమైన క్రమశిక్షణ, గాంభీర్యాన్ని బట్టి నేను ఊహిస్తున్నాను."

### ఇతరకార్యక్రమం

నేటిమధ్యాహ్నం గవర్నరు జనరలు విశాఖపట్నం రేవును దర్శించారు. రేవు అధికారులైన పి.సి. బాహల్, ఎస్. నంజుండయ్యగార్లు, ఇతరులు వారికి స్వాగతమిచ్చారు. హార్బరు చుట్టూ ఒకలాంచిలో గవర్నరు జనరలు సపరివారులై విహరించారు. సింధియా నౌకా నిర్మాణశాల వద్ద జనరల్ మేనేజరు ఎస్. జె. పాండ్యా, శ్రీమతి శాంతికుమారి మురార్జీ, ఐ. ఎన్. వంకావాలాగార్లు స్వాగతమిచ్చారు. నిర్మాణశాల కార్మికులు, ఉద్యోగులు ఒక వినతి పత్రం సమర్పిస్తూ నిర్మాణశాల పనిచేస్తూ వుండేలాగ చూడమని అర్థించారు. నిర్మాణశాల బహుశా మూసివేయబడదని రాజాజీ అన్నారు. తరువాత కొన్ని కర్మాగారాలను, కార్యాలయాలను రాజాజీదర్శించారు.

భారత నౌకాబలస్థావరం వద్ద రాజాజీకి నౌకాశాఖాధికారి కెప్టెన్ జె. గొలం స్వాగతమిచ్చారు. సైనిక గౌరవ వందనం స్వీకరించి రాజాజీ ఇలా ప్రసంగించారు.

"మీ స్వాగతానికి నా ధన్యవాదాలు. మీయెదుట ఒక మహోత్తమ కార్యమున్నది. మనమంతా సోదరులవలె చేతులు కలిపి పనిచేసి మనదేశాన్ని అభ్యుదయశిఖరానికి లేవనెత్తాలి. మీరు అన్యోన్యంగా ఉంటూ, అధికార్లకు విధేయులై ఉంటూ హృదయాల్లో ఆనందజ్యోతిని జాగ్రత్తగా కాపాడుకోండి." స్వ. ని.

## ఆస్ట్రియా సంధి సమస్య

### సంప్రతింపుల వైఫల్యానికి రష్యాయే కారణం

అమెరికా విదేశాంగశాఖ ఆరోపణ

వాషింగ్టన్, డిసెంబరు 15: ఆస్ట్రియా సంధి సమస్యపై న్యూయార్కులో అగ్రరాజ్య చతుష్టయ సంప్రదింపులు విఫలం కావడానికి కారణం రష్యాయేనని ఆరోపిస్తు అమెరికా విదేశాంగ శాఖవారు నేడొక ప్రకటన చేశారు. ఆ ప్రకటనలో యింకా యిలా ఉన్నది. "ఆస్ట్రియాను ఆక్రమించుకొన్న తొలిరోజుల్లో, రష్యా సప్లయి చేసిన సాధనసంపత్తికి సంబంధించి ఆఫ్రికా రష్యాల మధ్య ముందుగా వియన్నాలో ఒడంబడిక కుదురుట అవసరమని సోవియట్ డిప్యూటీ పట్టుబట్టాడు. ఈ విషయమై గత ఆగస్టునుండి వియన్నాలో సంప్రదింపులు జరుగుతున్నవి. ఎప్పుడో కుదరవలసిన, ఆస్ట్రియా సంధి ఒడంబడికకు, యీ సంప్రదింపులు ఎందుకు అడ్డుకావాలో అమెరికాకు అర్థంకావడంలేదు."

ఆస్ట్రియా సంధి సమస్యను చర్చించేందుకు, జనవరి 9-వ తేదీన, అగ్రరాజ్య విదేశాంగ మంత్రుల డిప్యూటీలు మళ్లీ సమావేశమవుతారు.

## ఇండియాపైగా డచ్చి విమానాల ప్రయాణం

### తాత్కాలిక నిషేధాజ్ఞపై డచ్చి వైఖరి

హేగ్, డిసెంబర్ 15: ఇండొనీషియా 'పోలీసుచర్య' సందర్భంలో ఇండియా, పాకిస్థాన్, బర్మా, ఇరాక్, సింహళ ప్రభుత్వాలు డచ్చి విమానాలు తమ దేశాల్లోనుంచి ప్రయాణం చేయరాదని కొంతకాలం నిషేధించినందుకు నష్టపరిహారం ఇవ్వమని తాము కోరలేదని డచ్చి ప్రభుత్వం నేడు ప్రకటించింది.

రాజకీయ కారణాలవల్లనూ మరికొన్ని ముఖ్య కారణాలవల్లనూ పరిహారం కోరకుండా ఉండటానికి నిశ్చయించుకున్నట్లు రవాణామంత్రి నేడు వెల్లడించాడు.

## బ్రిటిష్ నౌకలకు ఆల్బేనియావల్ల నష్టం

### ప్రపంచ న్యాయస్థానం తీర్పు

హేగ్, డిసెంబర్ 15 : 1946 అక్టోబర్లో రెండు, బ్రిటిష డెస్ట్రాయర్లకు కార్ఫూఛానల్లో ఆల్బేనియా మందుగసులు పెట్టి నష్టం కలిగించిందనీ అందువల్ల 8,43,947 పౌన్లను పరిహారంగా చెల్లించాలనీ అంతర్జాతీయ న్యాయస్థానం నేడిక్కడ తీర్పు చెప్పింది. ఆల్బేనియావిచారణలో పాల్గొనలేదు. పరిహారం ఎంత యివ్వాలో నిర్ణయించే అధికారం అంతర్జాతీయ న్యాయస్థానానికి లేదని ఆల్బేనియా ప్రకటించింది.

కార్ఫూఛానల్ ప్రమాదంలో ఒక బ్రిటిష్ డెస్ట్రాయర్ బాగానూ, రెండోది కొంచంగానూ దెబ్బతిన్నవి. 44 మంది నావికులు మరణించారు. 22 మంది గాయపడ్డారు.

## తూర్పు జర్మనీలో సోవియట్ విధానం

### పశ్చిమరాజ్యాల వైఖరిని పట్టి ఉంటుందని విషిన్స్కీ

బెర్లిన్, డిసెంబర్ 15 : పశ్చిమ జర్మనీలో ఒకసైన్యం ఏర్పడితే అప్పుడు తూర్పు జర్మనీలో సైన్యాన్ని స్థాపించటానికి రష్యా చర్యలు తీసుకుంటుందని సోవియట్ విదేశాంగమంత్రి విషిన్స్కీ నేడు తూర్పు జర్మన్ రాజకీయ నాయకులతో చెప్పినట్లు తెలుస్తున్నది.

విషిన్స్కీ లేక్ సక్సెస్ నుంచిమాస్కో వెళుతూ ఇక్కడ ఆగాడు. అతడు తూర్పు జర్మన్ రిపబ్లిక్ అధ్యక్షుడు విల్హెల్మ్ పీక్, ఉప ప్రధాని ఊల్ బ్రిక్ లతో చాలసేపు సంప్రదింపులు జరిపాడనీ, తూర్పు జర్మన్ పోలీసుదళం మరీ సైనికంగా తయారు కాకూడదని వారిని హెచ్చరించాడనీ తెలుస్తున్నది. కామిన్ ఫాంలో సభ్యత్వానికి తూర్పు జర్మనీ దరఖాస్తు పెట్టవలసిన అదును రాలేదనీ, సోవియట్, జర్మనీ సంబంధాలలో ఇప్పట్లో పెద్దమార్పు లేవీ రావనీకూడా అతడు చెప్పినట్లు తెలుస్తున్నది.

## ధవళేశ్వరంలో గాంధి పార్కు

### కళా వెంకట్రావుగారిచే ప్రారంభోత్సవం

రాజమహేంద్రవరం, డిసెంబరు 15 : కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకట్రావుగారు ధవళేశ్వరంలోని గాంధీపార్కుకు నిన్న సాయంత్రం ప్రారంభోత్సవం జరిపిరి. ఆ సందర్భమునజరిగినసభకు తూర్పుగోదావరిజిల్లాబోర్డు అధ్యక్షులు శ్రీ మారిన నరసన్నగారు అధ్యక్షతవహించిరి. ఈ పార్కు నిర్మాణమునకు జరిగిన కృషిని వివరించుచూ పంచాయతీబోర్డు అధ్యక్షుడు వై. వి. రమణయ్యగారు, మరికొందరు ప్రముఖులు మాట్లాడినపిమ్మట కళా వెంకట్రావుగారు ప్రసంగించుచూ దినమంతా కష్టపడువార్కి పార్కులు విశ్రాంతినీయగలవనీ, ముఖ్యంగా కర్మాగారాలలో పనిచేసేవార్కి యీ రకమైన విశ్రాంతి అవసరమనీ తెల్పిరి.

పప్పు వీరన్న బ్రదర్స్ వారు పార్కుకు ఒక రేడియో బహూకరించిరి. (స్వ. వి.)

## బ్రిటన్-భారతఒప్పందం చరిత్రాత్మకమైనది

(1-వ పేజీ తరువాయి)

వాణిజ్యానికింకా ప్రతిబంధకాలున్నవి. కాని బ్రిటను చేసే ఎగుమతి దిగుమతుల మధ్యగల వ్యత్యాసం క్రమంగా తగ్గుతూ వస్తున్నది. ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ బ్రిటను సాధిస్తున్న డాలరు సంపాదన హెచ్చుతున్నది.

"యుద్ధం ఆయిపోయినది లగాయతు బ్రిటనును బాధిస్తున్న ఆర్థిక-చిక్కులింకా తొలగలేదు. అయినా అదృష్టవశాత్తూ నిరుద్యోగ సమస్యలేదు, ప్రజల అవిరామ కృషివల్ల ఉత్పత్తి హెచ్చింది."

## ఇండియా బిల్లు చట్టమయింది

లండను, డిసెంబరు 16 : జనవరి 26న రిపబ్లికు అయిన అనంతరం కూడా ఇండియాకు బ్రిటిషు న్యాయచట్ట రక్షణ ఇవ్వవలసిన అధికార సౌకర్యాలు అందజేయుటకు ప్రవేశపెట్టబడిన బిల్లు నేడు చట్టరూపం పొందింది.

ఆస్తులుగల బ్రిటిషు యువతులకు పెళ్లాడిన అనంతరం కూడా తమ ఆస్తులపైనా, వాటిమీద రాబడిపైనా, పూర్తి హక్కులిస్తూ ప్రవేశపెట్టబడిన మరొక బిల్లుకూడా చట్టరూపం పొందింది. ఈ బిల్లు మాంటుబాటను సతికి లాభిస్తుంది.

# "ఆంధ్రరాష్ట్రం ఏర్పడినంతమాత్రాన పరిపాలనాసమస్యలు తొలగిపోవు"

## విశాఖపట్నం న్యాయవాదుల సభలో గవర్నరుజనరలు రాజాజీ అభిభాషణ

### వివిధ సంస్థల సందర్శనం: ప్రేమసమాజానికి 500 రూ. విరాళం

విశాఖపట్నం, డిసెంబరు 16: "ఆంధ్రరాష్ట్రనిర్మాణం మీ జీవితకాలంలోని గొప్ప సంఘటనలలో ఒకటని మీరన్నారు. కాని క్రొత్తరాష్ట్రమంటే క్రొత్త రాజ్యమని మీరెవ్వరూ ఊహించరాదు. మనదంతా ఒకే ప్రభుత్వమనీ, ఒకే దేశమని, జ్ఞప్తినుంచుకోండి. రాష్ట్రమంటే కేవల మొక పరిపాలనా విభాగంమాత్రమే కాని ప్రత్యేక రాజ్యంకాదు" అని గవర్నరు జనరల్ రాజగోపాలాచారిగారు నేడిక్కడ జిల్లాకోర్టులో న్యాయవాదుల సంఘంవారు తమకు సమర్పించిన వినతి పత్రానికి సమాధానమిస్తూ హెచ్చరించారు.

ఆంధ్రరాష్ట్రాన్ని గూర్చి ఆయనఇంకా ఇలా చెప్పారు.

"నిన్న ఎవరో నన్నడిగారు, బళ్లారి జిల్లాలోని మూడుతాలూకాలన్న ఆంధ్రరాష్ట్రంలో చేరిస్తే మిగతా ఆరుతాలూకాలసంగతి ఏమౌతుందని, ఆమిగతా తాలూకాలకు పోవటానికి దారిలేదని వారివాదం. దారిలేదనే ప్రశ్నే రావక్కరలేదు. రైళ్లు వెళ్ళగలవు; రోడ్డు ఇప్పట్లున్నట్లాగే వుంటాయి; మోటారుకార్లు వెడతాయి; మీరే మీ పన్నులగోడ కట్టలేరు;

ఎందుకంటే దేశానికంతటికీ ఒకే ప్రభుత్వమున్నది; ఆప్రభుత్వానికి లోబడే మన మీపనులన్నీ చేస్తున్నాము. కనుక ఇదికేవలం పరిపాలనా సౌలభ్యంకోసం జరిగే విభజన మాత్రమేనని గుర్తుంచుకోండి.

చాలరోజులు వేచినతర్వాత మనంకోరిన దానిని పొందితే, దానికి లేనిపోని గొప్పను, ప్రాధాన్యతను ఆపాదించటం మనకలవాటు. మీరు 1937 లో టి. విశ్వనాథంగారు నాకు పరిపాలనా కార్యంలో సహాయంచేస్తున్న రోజుల్లోనే ప్రత్యేక రాష్ట్రం పొందగలిగివుంటే, మీరిప్పుడు దానిని అర్థంచేసుకున్న విధిగాను, అర్థంచేసుకున్నట్టుగాను చెప్పివుండరు. ఇండియా స్వతంత్రమైనంత మాత్రం చేత ప్రతి క్రొత్త రాష్ట్రము స్వతంత్రముకాదు. కేంద్రానికి స్వాతంత్ర్యము యెక్కువైన కొద్దీ రాష్ట్రాలు కేంద్రముమీద మరింత యెక్కువగా ఆధారపడివుంటాయి. కేంద్రం స్వతంత్రముగా ఉంటూ ఘనతర బాధ్యతను వహిస్తున్నప్పుడు, వివిధరాష్ట్రాలుతమ విధానాలను సమన్వయం చేసుకుంటూ ఒకదానిపై ఒకటి ఆధారపడివుండవలసిన అవసరంకూడా యెక్కువ అవుతుంది. ఈ అవసరం స్వతంత్ర దేశాల్లో మరీ యెక్కువగావుంటుంది.

కనుక ఆంధ్రరాష్ట్రం ఏర్పడుతున్నప్పటికీ, వచ్చే క్రొత్తదనం యేమీ లేదనిమీరు గ్రహించాలి. పరిపాలనా సమస్యలుగాని, కష్టాలుగాని యెక్కడికీ పోవు. మీరు క్రొత్త రాష్ట్రం వచ్చినా, మీరు పాత రాష్ట్రంలోనే ఉన్నా అవి ఉండనే ఉంటాయి."

గవర్నరుజనరలు జిల్లాకోర్టుకు రాగానే టి. విశ్వనాథంగారు (ఎం. ఎల్. ఎ.) ఆహ్వానించి, వారికి న్యాయవాదుల సంఘాధ్యక్షుడైన వి. డి. ప్రసాదరావుగారిని పరిచయం చేశారు.

రాజాజీ న్యాయవాదుల నుద్దేశించి మాట్లాడుతూ ఇలా చెప్పారు.

"కోర్టులకు పని ఒత్తిడి తగ్గినట్లున్నది. చీటికీమాటికీ వ్యాజ్యాలతో కోర్టులకెక్కడం ప్రజలు మానివేసినట్లు తోస్తున్నది. మీ వృత్తికి దెబ్బతగిలినట్లుకూడా వున్నది. వ్యాజ్యములు తగ్గిపోవటం కూడా మంచి సూచనే. దీనిఅర్థం క్రొత్త సమాజం నిర్మింపబడుతున్నదని.

ధనికవర్గాలనుండి ధనం లాగివేయబడుతున్నది. క్షయంటునట్టుంపొందితే న్యాయవాదులుకూడా నష్టపడతారు. పరిస్థితుల్లో వచ్చిన మార్పును అన్నితరగతుల ప్రజలు అనుభవిస్తున్నారు. ఒక్కొక్కప్పుడు ఈ మార్పును తట్టుకోలేక అసంతృప్తి పెరుగుతుంది. ఈ అసంతృప్తికి మీరు లోనుగారని ఆశిస్తున్నాను.

మనం చదివే శాస్త్ర గ్రంథాలనుండి కేవలం వేదాంతసిద్ధాంతాలనేగాక వాస్తవిక విజ్ఞానమును కూడా మనం గ్రహించాలి. మన ప్రాచీన శాస్త్రాలలో వాస్తవిక విజ్ఞానం ఎక్కువగా ఉన్నదని నమ్మేవారిలో నేనొకడిని. అయితే వాటిలో ఉన్న ప్రతివిషయమూ ప్రతివాడికీ వర్తిస్తుందని అర్థంకాదు మనం ప్రస్తుత కాలానికి తగిన వివేకాన్ని అవలంబించి అభివృద్ధిచెందాలి. మనం ప్రాచీనగ్రంథాలను పరిశీలించి మనమెల్లా సుఖపడాలో, ఇతరుల నెలా సుఖపెట్టాలో నేర్చుకోవాలి."

#### నిర్విరామ కార్యక్రమం

నేటి ప్రాతఃకాలంనుండి గవర్నరు జనరల్ తమ నిర్విరామ కార్యక్రమాన్ని ప్రారంభించారు.

ముందు కింగ్ జార్జి ఆస్పత్రికివెళ్ళారు. ఆస్పత్రి సూపరింటెండు డా॥ డి. వి. రమణమూర్తిగారు రాజాజీ నాహ్వానించారు. ఆంధ్ర మెడికల్ కాలేజి ప్రిన్సిపాలు డా॥ ఎస్. జి. పాండలేగారుకూడా ఆయనకు స్వాగతమిచ్చారు. ఆస్పత్రిలోని వివిధ భాగములను దర్శిస్తూ, దంతవైద్యశాల, పరిశోధనశాల, శిశు చికిత్సాశాల, ప్రసూతిశాల, మున్నగునవి రాజాజీ చూశారు.

#### ప్రేమసమాజం

జిల్లాకోర్టునుండి రాజాజీ ప్రేమ సమాజానికి వెళ్ళారు. సమాజాధ్యక్షుడు కె. ఎస్. దత్తుగారు రాజాజీని ఆహ్వానించి, సమాజసభ్యులను, ఉద్యోగులను, మహిళాక్షేమ సంఘసభ్యులను పరిచయం చేశారు.

తమకిచ్చిన స్వాగతానికి కృతజ్ఞత తెలుపుతూ, ఇటువంటి అనాథశరణాలయములకు ధర్మపరులు విరివిగా విరాళాలిచ్చి ప్రోత్సహించవలెనని, విశాఖపట్నంలో ఈ మానవకారుణ్య సంస్థను నిర్వహిస్తున్న దాతలను, కార్యకర్తలను తాను ప్రశంసిస్తున్నాననీ రాజాజీ అన్నారు.

"చాల కొద్దిపట్టణాల్లో మాత్రమే ప్రజలు తమంతట తాము నెలకు 2 వేల రూ. లు సేకరించి ఇట్టి సంస్థలను నడపగలుగుతున్నారు. ప్రభుత్వము ఎన్నని చేయగలదు? ప్రజలు ఇట్టి విషయాలను స్వయంగా పూనుకోకపోతే ఎందరో సహాయార్థులైన దీనప్రజలు దిక్కుమొక్కు లేకుండా పోతారు. మీకు మోటారుకారు ఉండవచ్చు, జట్కాబండి వుండచ్చు అయినా అప్పుడప్పుడు మీరు నడవవలసిన అవసరం తప్పదు. అలాగే, మీకు పెద్ద రాబడి, ఖర్చు కలిగిన స్వతంత్ర ప్రభుత్వం ఉన్నప్పటికీ ప్రజలు స్వధనం వెచ్చించి ఇటువంటి కారుణ్య సంస్థలను నిర్వహించటం తప్పదు. లేకపోతే ఇంత తెలివితేటలు కలిగి పైకి రావలసిన బాలురు, బాలికలు వీధుల్లో దిక్కులేక నశిస్తారు. ప్రభుత్వ మెంతఅవసరమో, ప్రజల దానధర్మాలుకూడా అంతే అవసరం. అనాథ బాల బాలికలమాట అలావుంచి, ప్రజలు దయాదాక్షిణ్యాలను, ప్రేమను పెంపొందించుకోవాలి. శరీరం వ్యాయామంవల్లనే అభివృద్ధి అవుతుంది. అలాగే మనస్సు, ఆత్మ దానకర్మలవల్లనే అభివృద్ధి చెందుతుంది. మనం దాన ధర్మాలు చేయకుండానే చనిపోతే, మనకు జంతువులకు ఇక భేదమెక్కడ వుంటుంది? ఇండియాను గొప్పదేశంగా చేయగోరితే మనకు ప్రభుత్వం ఉన్నంతమాత్రాన చాలదు. దయాహృదయులు కూడా ఉండాలి. ప్రభుత్వం తరపున, ప్రజల తరపున నేను ఈ సంస్థను నడిపే దయావంతులను అభినందిస్తున్నాను. నారాకవల్ల ఈ సమాజానికి మరింత ప్రోత్సాహం కలుగుతుందని ఆశిస్తున్నాను."

ప్రేమసమాజంనుండి వెళ్ళిపోతూ రాజాజీ 500 రూ॥ల విరాళమిచ్చారు.

#### రాజాజీకి విందు

నేటిరాత్రి గవర్నరు జనరలుకు గంగాపూర్ భవనంలో కురుపాం రాజాసాహెబ్ గొప్పవిందుచేశారు. 30 మంది అతిథులకు ఏర్పాటు చేయబడినది. మద్రాసు గవర్నరు, జయపూర్ మహారాజా, జి. ఆర్. దేవరాజ అయ్యంగార్, శ్రీమతి నామగిరి, కురుపాం మహారాణి, డి. పద్మనాభం గార్లు హాజరయ్యారు.

నేటి మధ్యాహ్నం రాజాజీ విశాఖపట్నం రేవు ప్రాంతాన్ని, సింధియా నౌకా నిర్మాణశాలను, ఇ జనీరింగు షాపులను దర్శించారు.

"జలూషా", అను భారత నౌకలో నౌకా సైనిక గౌరవ విన్యాసమును వీక్షించిన తర్వాత, రాజాజీ నౌకా శాఖాధికారులతో కలిసి టీ సేవించారు.

## ఆంధ్రరాష్ట్ర అవతరణపద్ధతి

### గవర్నరు జనరల్ వివరణ

"తల్లిదండ్రులు బిడ్డకొరకై ఎంతోకాలం ఎదురుచూడవలసినా పదినెలలైనా వేచియుండవలెను. ఏడు నెలలకే బిడ్డస్వరూపం ఏర్పడుతుందా అని, డాక్టరునిపిలిచి కాన్పు చేయించ ప్రయత్నించరాదు. అట్లేఆంధ్ర రాష్ట్రం విషయమునను ఓర్పువహించవలసియుండును." అని గవర్నరుజనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు నిన్న విశాఖపట్నం పురపాలక సంఘంవారి సన్మానానికి చెప్పినసమాధానంలో అన్నారు.

## గవర్నరు జనరలు రాక

### మదరాసులో స్వాగతము

మదరాసు, డిశంబరు 17: గవర్నరు జనరలు సి. రాజగోపాలాచారిగారు మదరాసుగవర్నరు భవనగర్ మహారాజాగారు, కుమారై నామగిరి, కార్యదర్శి చాటర్జీ గార్లతో నేడు మీనంబాకం విమానాశ్రయంలో దిగినపుడు గవర్నరుసతి, ప్రధాని, మంత్రులు, న్యాయమూర్తులు పలువురు పెద్దలు ఘనముగు స్వాగత మొసంగిరి.

గవర్నరు జనరలు ఆఫ్ ఇండియా అనుపేరు లిఖింపబడిన విమానం, పైలటు కిటికీ ప్రక్కన త్రివర్ణ జాతీయ పతాకం ఎగురుచుండ నెమ్మదిగా 10.40 గం. లకు వేచియున్న ఉద్యోగిబృందం వద్దకువచ్చి నిలచెను.

ప్రధానమంత్రియు, గవర్నరు సతియు విమానంవద్దకుపోయి వారు దిగగానే వందనమాచరించి కరస్పర్శచేసి, స్వాగత మిచ్చిన వారందరివద్దకు తెచ్చిరి. ప్రధాని కుమారస్వామిరాజాగారు, వరుసగ, స్పీకరు శివషణ్ముగంపిళ్లె, మంత్రులు, బ్రిటిషు డిప్యుటీ హైకమిషనరులాకర్, సైనికాధికారిరుద్ర, సర్జను జనరలు భాటియా కామ, రాజనాదరు, బషీరు అహమ్మదు, కె. వెంకటస్వామినాయుడు, అమ్మన్నరాజా పోలీసు అధికారులు, మేయరు, టి. ప్రకాశం, శాస్త్రి, మున్నగువారందరిని పరిచయ మొనరించిరి.

లాకరు గారిని పరిచయ మొనర్చునపుడు "మీరీ గుంపులో ఎట్లు చేరిరో ఆశ్చర్యంగా వుంది" అని రాజగోపాలాచారిగారు ఛలోక్తిగ పలికిరి. పోలీసు ఐ. జి. దేవసహాయంగారినిచూచి "విశాఖపట్నం మీరు వచ్చేరుట గాని చూడలేకపోతిని" అని రాజాజి నుడివిరి.

#### "ఇతనెవరు?"

తరువాత వెనక వరుసలో నిలచియున్న రాజం భారతి, సుబ్బయ్య, సదాశివము, రాజాజి కుమారుడు కృష్ణస్వామి, మనుమలు మున్నగు వారందరి వద్దకుపోయి ప్రతి ఒకరిని పలుకరించిరి. ఒకరి చంకనున్న 3 సం॥ బిడ్డ రాజాజీ గారిని "అప్పా యువర్ యార్?" అని గట్టిగా ముమ్మారు ప్రశ్నించుసరికి అందరు నవ్వేరుగాని బిడ్డకెవ్వరు బదులు చెప్పలేదు.

తన కుమారుని మనుమలను గవర్నరు గారికి చూపి "వీరు నా కుటుంబంవారు" అని రాజాజి చెప్పగ గవర్నరుగారు వినయపూర్వకంగా నమస్కరించిరి.

గవర్నరు జనరలు మేజరు రుద్రగారితో కలిసి రాయలు ఇండియను ఎయిరు ఫోర్సు, ట్రివాంకూరు కొల్లం సైనిక దళముల గార్డు ఆఫ్ ఆనరు తిలకించివచ్చి, గిండీ గవర్నరు భవనానికి వెడలిపోయిరి

## అ. భా. యువజన కాంగ్రెస్ మహాసభలు

### జనవరి 1-3 తేదీలలో నాగపూర్ లో జరుగును

విజయవాడ, డిశంబరు 15: ఆంధ్ర రాష్ట్ర యువజన కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి త్రిపురాన రాఘవదాసుగా ఇట్లు వ్రాస్తున్నారు.

అఖిల భారత యువజన కాంగ్రెస్ మహాసభలు 1950 జనవరి 1, 2, 3 తేదీలలో నాగపూర్‌లో జరుగునవి ఈ సభలకు హాజరుకాగోరు ఆంధ్ర యువజన కాంగ్రెసు సేవకులు యీ నెల 25 వ తేదీ లోగా, రాష్ట్ర యువజన కాంగ్రెసు కార్యదర్శి, పిప్పరపోస్టు, పశ్చిమ గోదావరిజిల్లా చిరునామాకు తెలుపగోరుచున్నాను.

## కమ్యూనిస్టు చైనాను బర్మా గుర్తించే సూచన

### బర్మా విదేశాంగమంత్రి ప్రకటన

కలకత్తా, డిశంబరు 16: కమ్యూనిస్టు చైనాను బర్మా గుర్తింపనున్నదనీ, రేపు ఈ విషయంలో అధికార ప్రకటన వెలువడగలదనీ బర్మా విదేశాంగ మంత్రి యు. మాంగ్ ఈ సాయంత్రం తెలియజేశారు.

పి. టి. ఐ. విలేఖరితో ప్రసంగిస్తూ బర్మా విదేశాంగ మంత్రి యు. మాంగ్ తాను భారత ప్రధానమంత్రితో సంప్రతించడానికి వెడుతున్నానని అన్నారు. అయితే ఆయన సంప్రతింపు విషయాలను ప్రకటించడానికి నిరాకరించారు. బర్మారికి, ఆయన శిష్యులయిన శారీపుత్ర, మొగ్గలాయనులకు సంబంధించిన అస్తికలు కొన్ని బర్మాకు తీసుకుపోవడానికి కూడా తాను ఢిల్లీ వెడుతున్నానని బర్మా విదేశాంగమంత్రి చెప్పారు. ఈ అస్తిక లిప్పుడు కలకత్తా మహాబోధి సంఘం యాజమాన్యంలో వున్నాయని తెలుస్తున్నది.

చైనాలో కమ్యూనిస్టు విజయంవల్ల బర్మాలో కల్లోలం వచ్చేసూచన లేమైనా కన్నాయా అని అడగగా, చైనా కమ్యూనిస్టులు ముందుగా తమ పరిస్థితులు చక్కబరుచుకొంటారనీ, వారు విదేశాల్లో కల్లోలం కలగజేయ్యరనీ బర్మా విదేశాంగమంత్రి సమాధానం చెప్పారు.

బర్మాలో పరిస్థితులు చక్కబడుతున్నవనీ, వచ్చే మార్చిలోగాని, ఏప్రెలులోగాని ఎన్నికలు జరిపే ప్రయత్నాలు చేస్తున్నామనీ కూడా యు. మాంగ్ అన్నారు.

కామన్వెల్తు బర్మాకు చేసే సహాయాన్ని గురించిన ప్రశ్నకు సమాధానం చెబుతూ, యు. మాంగ్ ఇల్లాగ అన్నారు. "మేము అడిగే వస్తువులు ఇచ్చేదీలేనిదీ నిర్ణయించవలసింది కామన్వెల్తు దేశాలే. మాకు సహాయం లభించకపోతే, సహాయం లేకుండానే మా వ్యవహారాలు మేము చక్కబెట్టుకుంటాము. బర్మా మళ్ళీ కామన్వెల్తులో చేరదలచుకోలేదు. అయితే దీన్ని బట్టి కామన్వెల్తు దేశాలతో మాకు స్నేహ సంబంధాలు లేవని భావించకూడదు".

ఇండియా బర్మాని ముందుగా కొంత ఆర్థిక సహాయం చేయనున్నదనీ, దాని ప్రతిఫలంగా బర్మా ఇండియాకు బియ్యము, టేకుకలప పంపించగలదనీ, ఈ విషయాలే బర్మా విదేశాంగ మంత్రి పండిత నెహ్రూతో సంప్రతించ బోతున్నారనీ కొన్ని పత్రికలలో ప్రకటించ బడినది. బర్మా విదేశాంగ మంత్రి ఈ ప్రకటనలను గురించి మాట్లాడుతూ, ఈ వార్తలు నిజం కావనీ, తమదేశం కామన్వెల్తు ఒడంబడికను పూర్తిగా గౌరవిస్తుందని, ఆ ఒడంబడిక ప్రకారము, కామన్వెల్తు దేశాల మధ్య ఇలాంటి ప్రత్యేకమైన ఒడంబడికలు జరగకూడదనీ అన్నారు.

యు. మాంగ్ ఇంకా మాట్లాడుతూ తాను త్వరలోనే రాజకీయాలనుండి విరమింప బోతున్నామనీ, అనంతరం డిసెంబరు 20 వ తేదీని బర్మా సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవి స్వీకరింప బోతున్నామనీ అన్నారు.

వీరి అనంతరం షాన్ సంస్థానాధిపతి బర్మా విదేశాంగమంత్రిగా ఉండగలరని తెలుస్తున్నది. రేపు ప్రొద్దున్నే వీరు ఢిల్లీ వెడుతున్నారు.

## పస్తుల సాగరం హత్యకేసు

### నిందితునకు 3 సం॥ కఠినశిక్ష

ఏలూరు, డిశంబరు 15: పశ్చిమగోదావరిలో ప్రముఖులైన శ్రీ॥ శ్రీ॥ పస్తుల సాగరం గారిని గత జూలై 14 తేదీని హత్య కావించెననీ, ఆ సందర్భంలోనే, అడ్డువచ్చిన మల్లులరామస్వామిని కత్తితో గాయపర్చెననీ, కాంద్ర నరసింహమూర్తి పైన ఇం. పి. కోడు 302, 324 సెక్షనుల క్రింద పెట్టబడిన కేసులో, నిందితుడు హత్యా నేరముల క్రింద నేరస్తుడని రుజువు కాలేదనీ, 324 క్రింద మాత్రమే నేరస్తుడని రుజువైనదనీ నిర్ణయిస్తూ పై నేరమునకు 3 సం॥ కఠినశిక్ష విధిస్తూ, పశ్చిమగోదావరిజిల్లా సెషన్సుజడ్జీ పి. డి. తులసీరామ్ మొదలియార్ గారు తీర్పుయిచ్చారు.

జడ్జీగారు తీర్పులో, నిందితునిపై మోపబడిన హత్యానేరమునకు, నిందితుని కుమారులు, కోడలు ప్రత్యక్ష సాక్షులుగా ప్రాసిక్యూషనువారు విచారించిరనీ, వీరి సాక్ష్యము ఎంతమాత్రమూ సంతృప్తికరము కాదని, నేరము నిర్ధారింప గల్గినదని గాని చెప్ప వలనుపడదనిరి.

ఈ కేసులో ప్రాసిక్యూషన్ తరపున ఆర్. ఎ. రామారావుగారు (పబ్లిక్ ప్రాసిక్యూటర్) న్నూ, నిందితుని తరపున గుంటూరి వీరరాఘవులుగారును వాదించారు. (స్వ. వి.)

# పారిశ్రామిక సంస్థల ఉద్యోగులకు ప్రావిడెంట్‌ఫండ్

## 1950 లో బిల్లు ప్రతిపాదిస్తామని పార్లమెంట్‌లో జగ్జీవన్‌రాం ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబర్ 16: "పారిశ్రామిక, వాణిజ్యసంస్థలలో పనిచేసే ఉద్యోగులకు ప్రావిడెంట్‌ఫండ్ సౌకర్యం లభించేట్లు చేస్తూ ఒక శాసనం చేయాలని సర్వత్రా అంగీకరించబడినది ఈ విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నది. వచ్చే సం॥లో చిన్న చిన్న వాటితో సహా అన్ని పరిశ్రమల, అన్నిరకాల ఉద్యోగులకూ ప్రావిడెంట్ ఫండ్ సౌకర్యాన్ని లభింపజేయటానికి ప్రభుత్వం ఒక సమగ్రమైన బిల్లును ప్రవేశపెట్టగలదని హామీ ఇస్తున్నాను. ప్రావిడెంట్ పద్ధతిని ప్రవేశపెట్టేముందు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ఉద్యోగులకు ఉద్వాసన చెప్పటమన్నది భారీగా జరగకుండా నివారించటమే ప్రభుత్వపు ప్రధాన సంకల్పం." అని భారత కార్మికశాఖామంత్రి జగ్జీవనరాంగారు నేడు పార్లమెంటులో ప్రకటించారు:

నేడు పార్లమెంటు అనధికార ప్రతిపాదనలను చర్చించింది. కొన్ని రకాల ఉద్యోగులకు ప్రావిడెంట్ పద్ధతిని ప్రవేశపెట్టాలనీ, వెట్టిచాకిరీని శిక్షార్హంగా చేయాలనీ ఆర్. కె. సిధ్వాగారు ప్రతిపాదించిన రెండు బిల్లులపై చర్చ జరిగినప్పుడు జగ్జీవనరాం పైహామీని ఇవ్వగా ఆయన వాటిని ఉపసంహరించుకున్నాడు.

గోవధను నిషేధించిన బిల్లుపై కొంతసేపు చర్చ జరిగినమీదట కాలనిర్ణయం లేకుండా వాయిదా వేయబడినది. క్రిమినల్ కేసులను కూడా ప్రీవీ కౌన్సిల్‌కు పంపటం నిలిపివేయాలని పండిత ఠాకూర్‌దాస్ భార్గవా ప్రతిపాదించిన బిల్లుకూడా ఉపసంహరించుకోబడినది.

#### సిధ్వా ప్రతిపాదన

మొత్తం జీతాలమీద నూటికి 6 వంతుచొప్పున కొన్నిరకాల ఉద్యోగులకు ప్రావిడెంట్‌ఫండు ఏర్పాటు చేయాలని సిధ్వాగారి మొదటిబిల్లు ప్రతిపాదించింది. ఇది మొదట 1949 ఫిబ్రవరిలో ప్రతిపాదించ బడ్డది. ప్రజాభిప్రాయంకోసం దీనిని ప్రచారానికి పంపగా అత్యధిక సంఖ్యాకులనుకూలురై ఉన్నట్లు తేలిందనీ అప్పుడు ప్రభుత్వం ఒక బిల్లును ఈ విషయమై ప్రతిపాదిస్తుందనీ హామీ ఇచ్చిందనీ ఆయన అన్నాడు.

జగ్జీవనరాం దీనికి సమాధానమిస్తూ ప్రభుత్వం వెనుకటి హామీని పాటిస్తుందని హామీఇస్తూ పై చెప్పినట్లుగా వివరించాడు.

#### వెట్టిచాకిరీ నిషేధం

సిధ్వాగారి రెండోబిల్లు వెట్టిచాకిరీ, నిర్బంధించి చాకిరీ చేయించుకొనటం అన్నవాటిని నిషేధించి, శిక్షార్హం చేయాలనీ ప్రతిపాదిస్తున్నది. ఈ విషయమై పరిశీలించటానికి ప్రభుత్వం ఒక కమిటీని నియమిస్తానని ప్రభుత్వం వెనుక హామీ ఇచ్చిందేకాని ఇంతవరకూ నియమించలేదని ఆయన అన్నాడు.

జగ్జీవనరాం దీనికి సమాధానమిస్తూ పరిశీలన కొరకు ప్రత్యేకోద్యోగి నియమించబడ్డదనీ, అతడు తన నివేదికను కూడా ప్రభుత్వానికి అందజేశాడనీ, అందువల్ల కమిటీ నియామకం అనవసరమనీ అన్నాడు. ఈ దురాచారాలను నిషేధించటానికి శాసనాలే అచ్చుగా సరిపోవనీ, ప్రజల హృదయాలు కూడా మారాలనీ ఆయన అన్నాడు.

#### ప్రభుత్వ కృషి

"కొన్ని రాష్ట్రాలలో నిర్బంధచాకిరీ పద్ధతిని అనుమతించే శాసనాలు ఉన్నవి. వాటిని రద్దుచేయాలని కేంద్ర ప్రభుత్వం వాటికి ఉత్తరువు చేసింది. వ్యవసాయ కూలీల పరిస్థితులనుగురించీ కొన్ని గ్రామ ప్రాంతాల్లో ఉన్న నిర్బంధచాకిరీ విధానాన్ని గురించీ ప్రభుత్వం విచారణను ప్రారంభించింది. ఆ విచారణ ఒక ఏడాదిలో అయిపోతుంది. దానినిపట్టి ఎటువంటి చర్య తీసుకోవాలో ప్రభుత్వం నిర్ణయించ కలుగుతుంది" అని జగ్జీవనరాం ప్రభుత్వ కృషిని వివరించారు.

సమాజంలో తగిన హృదయ పరివర్తన లేకపోవటమే ఇంకా వెట్టిచాకిరీ ఉండటానికి కారణమని ఇంకా ప్రభుత్వం అనుకొనటం చాలా పొరబాటనీ, ఏదవ్పటికీ బిల్లును ఉపసంహరించు కుంటున్నాననీ సిధ్వా అన్నాడు.

#### గోవధ నిషేధబిల్లు

పాడి పసువులను, కాడి పసువులను రక్షించటానికి సేట్ గోవిందదాస్ ఒక బిల్లును ప్రతిపాదించగా దీక్రమ విరుద్ధమని అంబేడ్కర్ ప్రతిఘటించారు. క్రమ విరుద్ధం కాదని ఉపాధ్యక్షుడు అనంతశయనం అయ్యంగార్ తీర్పు చెప్పగా సేట్ గోవిందదాస్ దాని ఆవశ్యకతనుగురించి ప్రసంగించారు.

గోవధను పూర్తిగా నిషేధించాలనీ, కేవలం పాడిపసువులవధనే నిషేధిస్తే అది ఆచరణలోకి వచ్చేటప్పటికి విఫలమైపోతుందని ఆయన అన్నాడు.

#### పశురక్షణ – ప్రభుత్వ విధానం

వ్యవసాయమంత్రి జైరాంరాందాస్ సమాధానమిస్తూ ప్రభుత్వం పశుసంరక్షణ విషయమై పరిశీలించటానికి ఒక కమిటీని నెలకొల్పిందనీ, ఆకమిటీ రెండుతరగతులుగా పశువులను విభజించి, వేరేవేరే విధానాలను సూచించిందనీ అన్నాడు. ఉపయోగించే పశువులు, కానివి అని రెండు రకాలుగా ఆ కమిటీ పశువులన్నిటినీ విభజించింది, అయితే ఈ విషయమై శాసనాలు చేసే అధికారం కేంద్రానికి లేనందువల్ల నమూనా బిల్లును రాష్ట్రాలకు సూచించామనీ, అందువల్ల గోవిందదాస్ గారు బిల్లుపై చర్చ వాయిదా వేయాలనీ ఆయన కోరాడు.

ఆర్. కె. సిధ్వా సొసైటీల రిజిస్ట్రేషన్ చట్ట సవరణకు ఒక బిల్లును ప్రతిపాదించగా, అది రాష్ట్రప్రభుత్వాలకు చెందినదని అంబేద్కర్ హెచ్చరించారు. దానిమీదట బిల్లు ఉపసంహరించుకోబడినది.

## మద్యనిషేధ ఫలితాల సర్వే

### విచారణ జరిపే యత్నం

చెన్నపట్నం, డిశంబర్ 15: మద్యనిషేధము అమలుపరచినందువల్ల వెనుక ఆ దురభ్యాసమునకు అలవాటు పడినవారి స్థితి యేమైనా అభివృద్ధి యున్నదా యనియు ఆ కుటుంబాల ఆర్థిక సాంఘిక వ్యవహారములు యేమైనా పెంపొంది యున్నవా యనియు తెలుసుకొనుటకు ప్రస్తుతానికి ఒక సర్వే ఫిర్కా అభివృద్ధి నియమావళి అమలుపరచిన 34 ఫిర్కాలలో జరుపుటకు ప్రభుత్వము ఉద్దేశించియున్నది. ఈ విషయం సేకరణకు 6 నెలలు పట్టవచ్చును.

# పశ్చిమపాకిస్థాన్‌లో కాందిశీకఆస్తి విలువ 4 వేల కోట్లు

## ఇండియాలో ముస్లిం కాందిశీకుల ఆస్తి 400 కోట్లేనని ప్రభుత్వ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 16: ఇండియా పాకిస్తానులలో కాందిశీకులు వదలి పోయిన ఆస్తులను గురించీ వాటిలో గల వ్యత్యాసాలను గురించి, భారత పునరావాస శాఖవారు 54 పేజీలు గల కరపత్రం ద్వారా ఈ క్రింది వివరాలు ప్రచురించారు.

ప. పాకిస్తానులో కాందిశీకులు వదలి పోయిన ఆస్తుల విలువ 4 వేల కోట్ల రూపాయలు. ఇండియాలో నిలచి పోయిన కాందిశీకుల ఆస్తుల విలువ సుమారు 400 కోట్ల రూపాయలు.

కాందిశీకుల స్థిరాస్తుల విలువలలో వ్యత్యాసం క్రింద పాకిస్తాను ఇండియాకివ్వవలసిన మొత్తం వెయ్యి కోట్ల రూపాయలుంటుంది. ఇందులో 300 కోట్లు పొలాల బాపతు.

ప. పంజాబులో ముస్లిమ్‌ సేద్యరులు నీటి వసతిగల 80 లక్షల ఎకరాలపైచిల్లర భూములను వదలిపెట్టారు. తూ. పంజాబులో ముస్లిములు నీటివసతులు లేని 40 లక్షల ఎకరాలను వదలిపోయినారు.

అల్లరుల మూలంగా పాకిస్తానులో 3 లక్షల చదరపుమైళ్ల విస్తృతిగల ప్రాంతాల నుంచి ప్రజలు కాందిశీకులైపోతే, ఇండియాలో 87 వేల చదరపుమైళ్ల విస్తృతిగల ప్రాంతాలనుంచి మాత్రమే ప్రజలు వెళ్ళిపోయినారు. ఇండియాలో నాటికి 93 వంతుల మేరలో ముస్లిములు శాంతి భద్రతలు కలిగి జీవిస్తూ వచ్చారు.

పాకిస్తాను నుండి శరణార్థులై వచ్చి ఇండియామీద తిండికీ, నివాసానికీ ఆధారపడినవారి సంఖ్య ఆస్ట్రేలియాలోని జనసంఖ్యకు రమారమిగా ఉన్నది.

1947 ఆగస్టు 29 న అంతర్డొమినియన్ చర్చలలో అక్రమంగా ఆస్తులు స్వాధీనం చేసుకోరాదని నిర్ణయం జరిగినప్పటికీ, ఈ చర్చలు పూర్తికాగానే పాకిస్తాను ప్రభుత్వం ప. పంజాబు ప్రభుత్వానికి అంటు లేని అధికారాలిస్తూ ఆర్డినెన్సు అమలు చేసినందువల్ల ఆరాష్ట్ర ప్రభుత్వంవారు ముస్లిమేతరుల ఆస్తులను బహిరంగంగా స్వాధీనపరచుకోనారంభించారు.

ఈ సమస్యను గురించి 1947 అక్టోబరు 6 న మరొక అంతర్డొమినియన్ సమావేశం జరిగింది. అందులో పాకిస్తాను ప్రధాని లియాకతాలీఖాన్, అప్పటి పాకిస్తాను గవర్నరు సర్ ఫ్రాన్సిస్ మ్యూడీగారు పాల్గొన్నారు. అయినా 1947 డిసెంబరు 1 న ప. పంజాబు ప్రభుత్వంవారు, కాందిశీకులు తమ ఆస్తులను అమ్మడానికిగాని వినిమయం చేయడానికిగాని అనుకూలంగా మరొక ఆర్డినెన్సు జారీచేశారు.

1947 డిసెంబరు 18 నుంచి 22 వరకు ఢిల్లీలో ఉభయ అధినివేశాల కార్యదర్శులు సమావేశమై ఏర్పరచిన ఉపసంఘంవారు ఉభయప్రభుత్వాలమధ్య భూముల మారకం జరగడానికీ, భూముల ఖరీదులో తేడా రొక్కంగా ఇవ్వడానికీ పథకం తయారుచేశారు. ఈ పథకాన్ని 1948 జూలైలో ఉభయ అధినివేశాలమంత్రులు పరిశీలించి ఈ పథకం ప్రకారం మాత్రమే వర్తించాలని నిర్ణయించారు. దీనికికూడా విఘ్నం కలిగిస్తూ 1948 అక్టోబరులో పాకిస్తాను ప్రభుత్వం రెండు ఆర్డినెన్సులు జారీచేసి, ముందుగా ఇండియాతో సంప్రతించలేదు.

1949 జనవరిలో కరాచీలో జరిగిన ఒడంబడికనుకూడా మొదటగా పాకిస్తానే ఉల్లంఘించింది. బస్తీలలో ఉండే కాందిశీక స్థిరాస్తులు వ్యక్తిగతంగా వినిమయం కావడానికి అనుకూలంగా ఈ ఒడంబడిక జరిగింది. ఈ ఒడంబడిక జరిగినవెంటనే పాకిస్తాను మరొక ఆర్డినెన్సు అమలుచేసింది. దానిప్రకారం తమ ఆస్తులను అమ్ముకోవడానికిగాని వినిమయం చేసుకోడానికిగాని పాకిస్తాను వచ్చేవారు 1½ రోజులు మించి పాకిస్తానులో ఉండేటట్టయితే ప్రార్థిపన్ను చెల్లింపు సర్టిఫికేట్లు చూపందే వెళ్ళిపోరాదు.

కరాచీ ఒడంబడికను పాకిస్తాను ఆఖరుసారి గత జూలైలో ఉల్లంఘించింది. కాందిశీకుల ఆస్తులు గాని కాందిశీకులు కాదలచుకున్నవారి ఆస్తులుగాని అమ్మరాదని నిషేధిస్తూ పాకిస్తాను ఇంకొక ఆర్డినెన్సు అమలుజరిపింది.

## సింధు హిందువులపై ఘోర అత్యాచారాలు

### శరణాగతుల కథనం

బొంబాయి, డిసెంబరు 15: పాకిస్తానులో సింధీ హిందువులపై యెట్టి ఘోర అత్యాచారములు గావింపబడు చున్నవో, సింధీ హిందువులను పాకిస్తానునుండి వెడగొట్టుటకు వారి ఆస్తులు కాందిశీక ఆస్తులుగా యెట్లు ప్రకటింపబడుచున్నవో నేడు కరాచీనుండి 'ఎస్. ఎస్. సబర్మతీ'లో బొంబాయివచ్చిన 200 మంది శరణాగతులు వివరించి చెప్పిరి.

"సింధులో హిందువుల స్థితి అత్యంత జాలికరముగా నున్నది. హిందువులైనంత మాత్రముచేత వారిని దేశద్రోహులుగా తలచుచున్నారు. వారికి వాక్ స్వాతంత్ర్యములేదు. ఇస్లామ్‌మతమును స్వీకరించకపోయిన యెడల ఫలితములు మహాఘోరముగా నుండునని గ్రామసీమలయందలి హిందువులను బెదరించుచున్నారు. పాకిస్తానులో భద్రత యేమాత్రము లేకపోవుటచేత సింధుహిందువులు భారత దేశమునకు వచ్చియున్నారు" అని నేడు యిచ్చటికి వచ్చిన శరణాగతులు చెప్పిరి. వీరిలో చాలా భాగము గ్రామసీమలనుండి వచ్చినవారు.

హైదరాబాదునుండి (సింధు) వచ్చిన భూస్వామి శ్రీ మోతీరామ్ వాస్వానీ యిట్లు చెప్పెను:

"నా భవనములన్నిటిని కాందిశీక ఆస్తి 'కస్టోడియను' వశపరచుకొనెను. బాంకులనుగాని, బకాయిలనుగాని నన్ను వసూలు చేసికొన నివ్వకపోయిరి. హిందువులకు ఆస్తిలేకుండాచేసి వారిని దేశమునుండి పంపివేయవలెనను ఉద్దేశ్యముతో పాకిస్తాను ప్రభుత్వము కాందిశీక ఆస్తి ఆర్డినెన్సు గావించియున్నారు."

తన బియ్యపు ఫాక్టరీని, తన భూములను, తాను నివసించుచుండిన యింటిని కాందిశీక ఆస్తిగా ప్రకటించి ముస్లిము శరణాగతులకు యిచ్చిరని ఖేయిర్‌పూరు వాసి యగు భాయి భూదరమల్ గారు చెప్పిరి.

ముస్లిం శరణాగతులు తనభూములలోని పైరులను కోసుకొని తీసికొని పోయిరని లారుకా నివాసి భాయి నారాయణ్ గారు చెప్పిరి:

తన బియ్యపు మరను రక్షించుకొనుటకు తాను ఒక ముస్లిమును భాగస్థుడుగా చేర్చుకొనెనని, కాని ఈ ముస్లిము తనకు ద్రోహము చేసి బియ్యపు మరను తనదిగా చేయించుకొనెనని పాకిస్తాను నుండి వెళ్లిపోనియెడల జైలులో పెట్టించెదనని తన్ను బెదరించెనని లార్కానా నివాసి భాయి చంగోమల్ సాతీరామ్ చెప్పెను. 'పాకిస్తాన్ కాందిశీక ఆస్తి ఆర్డినెన్సును బహుకఠినముగా అమలులో నుంచి, మేము భారత దేశమునకు వలస వెళ్ళ సంకల్పించుచున్నామను సాకున వానిని కాందిశీక ఆస్తిగా ప్రకటించుటచేత మా జన్మభూమినివదలి మేము రావలసివచ్చినది' అని అతడు చెప్పెను.

ఈ శరణాగతులను తాము నాసిక్ దగ్గరనున్న మఖ్రోల్ శిబిరమునకు పంపుచుండెనని బొంబాయి ప్రభుత్వ ప్రతినిధి యొకడు చెప్పెను.

# గుంటూరు పొగాకు పరిశోధన కేంద్రం: గవర్నరు సందర్శనం

## వీరయ్యచౌదరిగారి నర్సింగ్‌హోంలో వ్రణ చికిత్సాలయానికి ప్రారంభోత్సవం

గుంటూరు, డిసెంబరు 13: గవర్నర్ సతి శ్రీమతి రుక్మిణి ప్రభాకరరావుతో కలిసి నేటిమధ్యాహ్నము, స్థానిక ప్రభుత్వ స్త్రీల కళాశాలను సందర్శించిరి. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి సీతమ్మాళ్ గారు గవర్నర్ సతికి స్వాగతమిచ్చుచూ, కళాశాలలోని వివిధ తరగతులను, సైన్సు లేబరేటరీలను చూపిరి. తదుపరి విద్యార్థిని శ్రీమతి రంగనాయకమ్మ వీణా వాయిద్యమును వినిపించిరి. శ్రీమతి సీతమ్మాళ్ మహారాణిగారికి కళాశాల తరఫున సన్మానపత్రమును సమర్పించుచూ, తమ కళాశాలకు వసతి గృహము లేనందువలన, విద్యార్థినులు ఉపాధ్యాయినులు కలిసి మెలసి జీవించి సాంస్కృతిక జీవనవిధానమును నలవర్చుకొనుటకు, వీలులేకుండా పోవుచున్నదనిరి పైగా కళాశాలకు ప్రత్యేక భవనములేదు. వున్నచోటు చాలా ఇరుకైనది. ఏర్పాటులు, వసతులు ఎంత తక్కువైనప్పటికిని, నిపుణులైన అధ్యాపకులు వుండుటచే, పరీక్షలలో విద్యార్థినులు ప్రతి సంవత్సరం అధికసంఖ్యగా ఉత్తీర్ణులగుచున్నారు. కాని ప్రతి సంవత్సరము, విద్యార్థినులసంఖ్య తగ్గిపోవుచున్నది. స్త్రీల కళాశాలలో ప్రవేశము దొరకకున్నచో, పురుషుల కళాశాలలో స్త్రీలను చేర్చుకొనవీలగును అని విశ్వవిద్యాలయమువారు ఉత్తరువులు చేయవలెను అని శ్రీమతి సీతమ్మాళ్ అనిరి.

శ్రీమతి పంకజమ్మ వందనము లర్పించెను.

### సేవా సమాజం-రెడ్‌క్రాస్ సంఘం

తదుపరి గవర్నర్ సతి 'సేవా సమాజము-రెడ్‌క్రాస్ సంఘము'లను సందర్శించిరి. రెడ్‌క్రాస్ మందిరమువద్ద మహారాణి గారికి, శ్రీమతి రుక్మిణి ప్రభాకరరావు గారికి, సేవాసమాజసభ్యులైన డా॥ సి. హనుమంతరావు, డా॥ సుశీలాబాయి, గుంటూరు సుబ్రహ్మణ్యంగారలు స్వాగతము తెల్పిరి. సేవాసమాజము తరఫున గవర్నర్ సతికి సమర్పింపబడిన సన్మానపత్రములో, మన స్వాతంత్ర్య శిశువుకు రెండు సంవత్సరముల మూడునెలలు మాత్రమే వయస్సుకాగ, ఆ శిశువును సాకి, సక్రమ జాతీయపథములోనుంచుట, స్త్రీల ధర్మమనిరి. ఈ శిశువుకు పేదతనము, అమాయకత్వము, అవిద్య, సోమరితనము, అనారోగ్యము, మొదలైన అవలక్షణములు సంక్రమించినవి. వీటిని పోగొట్టుటకు సేవాసమాజము కంకణము గట్టుకొనినది అని తెల్పిరి మహారాణిగారు సమాధాన మిచ్చుచూ, మానవసేవ అనేకవిధములుగానుండుననియు, సేవాతత్పరులనేకులు మనకు ప్రస్తుతము వసరమనియు, సేవాసమాజ సభ్యులు ఆదర్శ జీవనమును గడుపవలెననియు ఉద్బోధించిరి.

తదుపరి రెడ్‌క్రాస్ మందిరమునకు పైన క్రొత్తగా కట్టబడిన హాలుకు మహారాణిగారు ప్రారంభోత్సవం జరిపిరి. మాజీ కలెక్టర్, ప్రస్తుతము స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టర్ అయిన శ్రీ ప్రభాకరరావు నాయుడు, గవర్నర్ సతికి, హాలునునిర్మించిన డివిజనల్ ఇంజనీర్ ఎ. నరసింహారెడ్డిని, రెడ్‌క్రాస్ సంఘమునకు అనుబంధముగా నున్న ప్రసూతి, శిశువైద్యశాలల సిబ్బందిని పరిచయము చేసిరి.

### కస్తూర్బా హరిజన హాస్టల్

అనంతరం మహారాణి శ్రీమతి విజయబాగారు కస్తూర్బా హరిజన హాస్టల్‌ను సందర్శించిరి. శ్రీమతి కమలామూర్తి, శ్రీమతి దుర్గాంబ, శ్రీమతి సునంద, గవర్నర్ సతికి స్వాగత మిచ్చి, హాస్టల్‌ను చూపిరి. హాస్టల్‌ను విస్తృతము చేయవలెనని, మామూలు సౌకర్యములైనను ఉండునట్లు గట్టి ఏర్పాట్లను చేయవలెనని మహారాణికి వినతిపత్రము నందజేసిరి.

### పొగాకు పరిశోధన కేంద్రం

మద్రాసు గవర్నరు శ్రీకృష్ణకుమార్ సింహజీ భావసింగ్ జీ నేటి మధ్యాహ్నము సిగరెట్ పొగాకు పరిశోధన కేంద్రమును చూచిరి. గుంటూరుజిల్లా పొగాకు ఉత్పత్తిలో; దేశమున కంతటికి ముఖ్యమైన ప్రాంతము. మంచిరకమైన వర్జీనియా పొగాకుక్రింద దాదాపు 90 వేల యకరములున్నది. 70 వేల యకరములు నాటు పొగాకు క్రింద నున్నది. ఈపరిశోధన కేంద్రమువారు, పొగాకు ఉత్పత్తిని అధికము చేయుటకు, ఉత్పత్తి వ్యయమును తగ్గించుటకు మార్గముల నన్వేషించుచున్నారు. పొగాకు గింజలలో నూనె ఉండును. పరిశోధన చేసినచో ఈగింజలు మంచి ఉపయోగములోకి రావచ్చును. నూనెనుంచి, రంగులకు వార్నిసులకు పలసిన పదార్థమును తీయవచ్చును. మిగిలిన పిండి పశువులకు, ఎరువులకు పనికి వచ్చును. గుంటూరునుంచే 250 లక్షల పౌన్ల పొగాకు విదేశములకు ముఖ్యముగా ఇంగ్లండుకు ఎగుమతి అగుచున్నది. ఈ జిల్లా ప్రాముఖ్యతను గమనించి ఇచట కేంద్ర ప్రభుత్వమువారు ఒక పరిశోధన కేంద్రము నేర్పాటు చేసిరి. మరియొక కేంద్రము జంగిగల్లులో, ఇంకొక ముఖ్యకేంద్రము రాజమండ్రిలోను ఉన్నవి.

పరిశోధన కేంద్రమునుగురించి, కేంద్రపు డైరెక్టర్ బి. యస్. కదంగారు, పి. యల్. తాండన్, టి. నారాయణరావు గారలు గవర్నర్‌గారికి వివరముగా తెల్పిరి. గవర్నర్‌గారు, "విజిటర్స్-పుస్తకము"లో, ఇచటి పరిశోధన పొగాకు పరిశ్రమకు అత్యంతము గా ఉపయోగింపగలదని, త్వరలో మనదేశము ఇతర దేశములతో, పొగాకు పరిశ్రమలో పోటీకి నిలవగలదని తాము విశ్వసించుచున్నామని వ్రాసిరి.

### వ్రణచికిత్సాలయ ప్రారంభోత్సవం

అనంతరం గవర్నరుగారు డా॥ పరుచూరి వీరయ్యచౌదరి నర్సింగ్ హోంలో వ్రణచికిత్సాలయమునకు ప్రారంభోత్సవము చేసిరి. డా॥ వీరయ్యచౌదరి గవర్నర్‌గారికి సమర్పించిన సన్మానపత్రములో, ఇట్లు తెల్పిరి: "పేదలకు, ఆర్తులకు, పీడితులకు సేవచేయుటద్వారా మానవుడు ఉత్కృష్టతను సంపాదించుకొనును. మానవుడు సాధించిన విజయములలో ఎన్నదగినవి, రోగము, మృత్యువుపైన అతడు చేయుచున్న పోరాటఫలితములు. వ్రణబాధా నివారణకు జరిగిన ప్రయత్నములలో జర్మన్ విజ్ఞాని రాంట్జన్ కృషి మరువరానిది. ఆ మహానుభావుడు 'ఎక్స్‌రేను' కనిపెట్టెను. మేరీ స్క్లొడోవ్‌స్కా అను పోలిష్ స్త్రీ విజ్ఞాని, తన ఫ్రెంచి భర్త పేరి క్యూరీతో కలసి ఈ చికిత్సకు తోడ్పడు పరిశోధన అనంతముగాచేసి, ఒక క్రొత్త పదార్థమును కనిపెట్టి, ఆపదార్థమునకు తన జన్మభూమి పేరున కనుగుణముగా పోలోనియం అని పేరు పెట్టుకొనెను. స్క్లొడోవ్‌స్కా పరిశోధనలనాధారము చేసికొని, రేడియం కనుగొనబడెను. దానినాధారం చేసుకొని 'రేడియో తెరపీ' అను క్రొత్త వైద్యవిధానము ఉద్భవించెను. వ్రణబాధకు మంచి వైద్యము దొరికినదికాని వ్రణకారణము ఇంకనూ తెలియరాలేదు ఈ మహావిజ్ఞానులు సాగించుచున్న సత్యాన్వేషణ మనకు తప్పక సేవానురక్తిని కల్గింపగలవు. ఇంగ్లండులో ప్రతి ఇరవైలక్షల ప్రజలకు ఒక 'రేడియో తెరపీ' కేంద్రము ఉండవలెనని నిర్ణయించిరి. అందువలన గుంటూరులో ఒక రేడియో తెరపీ కేంద్రము (వ్రణచికిత్సాలయము) ఉండుట అత్యవసరము."

గవర్నర్‌గారు మాట్లాడుచూ, మనదేశములో వ్రణమునకు చికిత్సలేక, అసలు అది వ్రణమని చాలాకాలమువరకు తెలియక, అనేకులు బాధపడి మరణించుచున్నారనిరి. ఒక్క మద్రాసులో మాత్రము బర్నార్డు ఇన్‌స్టిట్యూట్‌లోను, జనరల్ హాస్పిటల్‌లోనూ వ్రణచికిత్స కేర్పాటులున్నవి. వ్రణరోగులు అంత దూరమువచ్చుట వ్యయ ప్రయాసా భరితమైన పని. వ్రణచికిత్సకు ఇంతకంటె ఎక్కువ సౌకర్యములు లేనప్పుడు, డా॥ వీరయ్యగారు ఇట్టి చికిత్సా కేంద్రమును స్థాపించుట ముదావహము అనిరి.

శ్రీ పాములపాటి కృష్ణయ్య, వైద్య కళాశాల ప్రిన్సిపాల్ గోవిందమీనన్ గారలు డా॥ వీరయ్యగారి నభినందించుచూ మాట్లాడిన తదుపరి డా॥ వీరయ్యగారు గవర్నర్ క్షేమనిధికి రు 216 లను సమర్పించిరి. శ్రీమతి త్రిపురనేని శ్రీహరి, క్షేమనిధికి నూటపదహార్లనిచ్చిరి.

తర్వాత గవర్నరుగారు నేషనల్ టుబాకో కంపెనీనిచూచిరి. కంపెనీ వారు, సిగరెట్లనిస్వగా, గవర్నర్‌గారు తమకు ప్రజాక్షేమనిధికై డబ్బుకావలెను కాని సిగరెట్లక్కరలేదని', గవర్నర్‌గారు అంటిట కార్మికులను పరామర్శించిరి. కార్మికులు "గాంధీకీజై" అనుచూ గవర్నర్‌గారికి స్వాగతమిచ్చిరి. పొగాకు పరిశ్రమలో ఓర్పుచాలా అవసరము అనియు అందుకుస్త్రీలు తగినపనివారనియు గవర్నర్‌గారికి తెల్పిరి. కార్మికులందరితోనూ గవర్నర్‌గారు చాలాచనువుగా మాట్లాడసాగిరి. కార్మికులు తమ తమ ఇబ్బందులను స్వేచ్ఛగా గవర్నర్‌గారికి తెలియజేసిరి. (స్వ. వి)

# ఫ్రెంచి ఇండియాలో జనవాక్యనిర్ధారణ

## వచ్చే మార్చినెలాఖరులోగా జరుగవచ్చు

న్యూఢిల్లీ, డిసెంబరు 14: ఫ్రెంచి ఇండియా ప్రాంతాలలో జనవాక్యనిర్ధారణ 1950 మార్చినెలాఖరులోగా జరుగవచ్చునని అధికారవర్గాల నేడిక్కడ తెలియవచ్చింది.

జనవాక్యనిర్ధారణ కార్యక్రమానికి సంబంధించిన కొన్ని విషయాలు యింకా పరిష్కారం కావలసివున్నప్పటికీ, పంటకోతలకాలంలో పుగానే జనవాక్యం యేర్పాటు చేయాలని, ఫ్రెంచిప్రభుత్వమూ, ఇండియా ప్రభుత్వము అంగీకరించినవి.

పంటకోతలు ఏప్రిల్‌నుండి ప్రారంభమౌతవి.

ఫ్రెంచి ఇండియా భూభాగాలలో జనవాక్యనిర్ధారణకు సంబంధించిన పరిస్థితులను స్వయంగా పరిశీలించేందుకు ఫ్రెంచి ఇండియాప్రభుత్వాలు సమ్మతించే, అంతర్జాతీయ పరిశీలకులు జనవరిలో ఇక్కడికి రాగలరు. 12 మంది అంతర్జాతీయ పరిశీలకులలో ఉభయప్రభుత్వాలు యింతవరకూ 8 మందిని ఎంచుకున్నవని, మిగతా నలుగురిని త్వరలోనే ఎంచుకోగలవని తెలుస్తున్నది. ఈ 12 మందిలో ఫ్రెంచివారుకాని, భారతీయులుగాని ఎవరూ వుండరు. పరిశీలకులలో నల్గురు ఆశియాదేశాలవారై వుంటారని తెలుస్తున్నది.

## ఫ్రెంచి కమిషనర్‌కు పిలుపు

పుదుచ్చేరి, డిసెంబరు 15: ఈ మాసములో సమాలోచనలకై ప్యారిస్ రావలసినదిగా ఫ్రెంచి ప్రభుత్వమువారు భారత దేశమునందలి ఫ్రెంచి భూభాగముల కమిషనరు జాన్ జార్జిస్ చాంబను ఆదేశించిరని నేడు యిచ్చట తెలిసినది. డిసెంబరు 22 తేదీన ఫ్రెంచి పార్లమెంటులో చర్చకురానున్న విషయములను గూర్చి ఫ్రెంచి ప్రభుత్వమువారు చాంబన్‌తో ఆలోచింప గోరుచున్నారని తలపవచ్చును.

కుక్క కాటువల్ల కలిగిన గాయమునకై చాంబను యిప్పుడు చికిత్స నొందుచున్నాడు. వెంటనే పారిస్ వెళ్లుటకు అశక్తతను చాంబన్ వెల్లడించెనని తెలియుచున్నది. ఫ్రెంచి ఇండియా కమిషనరు జనవరి మొదటివారములో ప్యారిస్‌కు వెళ్లవచ్చునని నమ్మకమైన వర్గములద్వారా తెలియుచున్నది.

## జాతీయవాదుల సంతసము

పుదుచ్చేరి, డిసెంబరు 15: జన వాక్యము సక్రమముగుటకు రిజస్టర్డు వోటర్లలో 100 కి 51 వంతులు వోటు చేయవలెనను సూచనను భారత ప్రభుత్వము అంగీకరించెనని గోబర్టుచేసిన ప్రకటనను ఢిల్లీ అధికారవర్గములు ధృవపరుపలేదనువార్త ఫ్రెంచి ఇండియా జాతీయవాదులకు అనగా ఫ్రెంచి ఇండియా భారత దేశములో లీనమైపోవలెనని కోరువారికి హృదయ భారముతొలగించినది. గోబర్టు ప్రకటన వారిని అశనిపాతమువలె తాకియుండెను. కాని కొంతమంది మాత్రము గోబర్టు ప్రకటనను నమ్మలేదు.

## ఓటర్ల జాబితాల సవరణ

పాండిచ్చేరి, డిసెంబరు 14: ఫ్రెంచి ప్రభుత్వం గెజెట్‌లో ప్రకటించిన డిక్రీ ప్రకారం, ఫ్రెంచి ఇండియాలో ఓటర్ల జాబితాల సవరణ, రేపటినుంచి ప్రారంభం కావాలి కాని ఆ ప్రయత్నం రేపు ప్రారంభమయ్యే సూచన యేమీ కన్పడటం లేదు. పాండిచ్చేరిలోని అధికారులు గూడా యీ విషయమైనిర్ధారణగా యేమీ చెప్పలేదు.

# మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 17:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎక్స్చేంజి బాంబు సేల్సుటాక్సుతోసహా రు. 76 8 0 పెట్లా బంగారు తులం 115-0-0 మూసబంగారు 113-8-0 సీమవెండి తులం 100-కి (రెడి 178-0-0 వెండి తులం 1-కి 1-12-6

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎస్సు కోస్తాగిడంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది రు. 163 163-8-0 (కోరమాండల్)

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (ఏవరేజి) రు.328-8-0 33) బిలో 3% యఫ్. యఫ్. ఎ. కొంకాయనూనె (87 పౌన్ల గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వాలిటీ. రు. 38-8-9

ఆముదం

కాండి 500 పౌనులుగలది రు. 255-0-0 (ఒంగోల్) నరసరావుపేట)కు. 27?-0-0

పంచదార

| | | |
|---|---|---|
| హసన్‌పూర్ | ,, | రు. 93-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-7-10 |
| హైతాల్‌పూర్ " (2 అందరు) | | 94-0 8 |
| ,, | ,, | 93-6-0 |
| ,, | ,, | 93-15-0 |
| ,, | ,, | 92-14-0 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 16:

మార్చివాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | వెల | 30 33 |
| నిన్న | | 30 16 |
| ,, ముగింపు | వెల | 30 50 |
| నిన్న | | 30 23 |

# "బీదల యోగక్షేమాలకై పాటుపడడమే స్థానికసంస్థల ప్రధానబాధ్యత"

## గుంటూరు పౌరసన్మాన సందర్భంలో మద్రాసు గవర్నరు సందేశం

గుంటూరు, డిశంబరు 14: మద్రాసు గవర్నరు భావనగర్ మహారాజాగారికి నిన్న మధ్యాహ్నం గుంటూరు పురమందిరంలో జిల్లాబోర్డువారు స్వాగతపత్రమును, గుంటూరు పురపాలక సంఘంవారు పౌర సన్మాన పత్రమును సమర్పించారు.

పురమందిరం ప్రేక్షకజనంతో క్రిక్కిరిసిపోయింది. ప్రముఖులనేకులు హాజరయ్యారు. చైర్మన్ ఉప్పుటూరి పున్నారావుగారు మునిసిపల్ కౌన్సిలర్లను గవర్నరుగారికి ఎరుకపరచారు:

### పౌరసన్మాన పత్రం

సభ ప్రారంభమైన పిమ్మట చైర్మన్ పున్నారావుగారు పౌర సన్మానపత్రం చదువుతూ ఇలా అన్నారు.

"ప్రాచీన హిందూ రాజరిక సాంప్రదాయాలలో పుట్టి, పాశ్చాత్య ప్రజాస్వామ్య సిద్ధాంతాలలో పెరిగిన మీవంటి సమర్థుడైన వ్యక్తి మా రాష్ట్రానికి గవర్నరు కావటం మా భాగ్యం. మీ ఆధిపత్యం క్రింద భావనగర్ సంస్థానం కొలదికాలంలో ఇండియాలోని ప్రధాన సంస్థానాలలో ఒకటిగా అభివృద్ధికావటమే మీ రాజకీయ చతురతకు తార్కాణం. పరిపాలనాధికారాలు లేకపోయినా, మంత్రివర్గమునకు అధిపతిగా, సలహాదారుగా, పర్యవేక్షకుడుగా పెద్ద పలుకుబడిని నెలకొల్పే గవర్నరుపదవికి మీ రన్నివిధాలా అర్హులు.

మా పట్టణానికి గర్వించదగిన చరిత్ర విజయములు ఉన్నాయి. స్వాతంత్ర్యసమరంలో ఇది ఎప్పుడూ పురోగామిగానే వుంది. ఆంధ్రదేశానికి వర్తకంలోను, విద్యలోను ఇది కేంద్రం. అయితే ఈ పట్టణం ఇటీవల జనాభాలోను, వైశాల్యంలోను విరివిగా పెరిగి జన సమ్మర్దం ఎక్కువ కావటంమూలాన పారిశుద్ధ్యం పూర్తిగా నశించింది. తత్ఫలితంగా ఇది వ్యాధులకు, ముఖ్యంగా మలేరియాకు పుట్టినిల్లయింది. మా పట్టణానికి తక్షణావసరాలు జలసదుపాయం, మురికినీటి పారుదల. ఇవి సరిగా లేకపోవటం చేత పట్టణం బాగా అభివృద్ధిపొందటం లేదు. ఎన్నో పొర్లు ప్రభుత్వంవద్దకు రాయబారాలు వెళ్ళగా, ప్రభుత్వం జలసదుపాయాన్ని మంజూరుచేసింది. కాని ఈ పని చురుకుగా సాగటంలేదు. ఈ రెండు అవసరాలను మీరు శ్రద్ధ వహించి తీర్పించవలసిందిగా ప్రార్థిస్తున్నాము. మా కుమంచిరోజ్వంది; రాబోయే ఆంధ్రరాష్ట్రమునకు మేము సర్వవిధయోగ్యమైన రాజధాని నిస్తాము."

### స్వాగతపత్రం

గుంటూరుజిల్లాబోర్డు తరఫున గవర్నరుకు స్వాగతమిస్తూ బోర్డు అధ్యక్షుడు కల్లూరి రాజ్యలక్ష్మిగారు ఇలా అన్నారు.

"గుంటూరుజిల్లాబోర్డు మీకు హృదయపూర్వక స్వాగతమిస్తున్నది. మేము యీ అధికారంలోనికి వచ్చి నెలరోజులుకూడా సరిగా కాలేదు. కనుక మేము చేసిన ప్రజాసేవా కార్యములను ఇప్పుడప్పుడే చెప్పుకోజాలము. కాని, మమ్ము ఎన్నుకొన్న ప్రజలను సేవించటానికి శక్తివంచనలేక కృషిచేస్తామని వాగ్దానంచేస్తున్నాము. రాజకీయ సంస్కరణా రంగంలో మీ అభ్యుదయ భావాలు సర్వజనవిదితములు. మీ పరిపాలనా కాలంలో ఆంధ్రరాష్ట్రం ఉదయించబోవటం ముదావహం."

### గవర్నరుగారి సమాధానం

మునిసిపాలిటీ, జిల్లాబోర్డుల స్వాగతమునకు సమాధానంగా గవర్నరుగారు ఇల్లా ఉపన్యసించారు.

మీ ఉభయుల స్వాగత సన్మానాలకు నా ధన్యవాదాలు. చైర్మన్ గారు వెలిబుచ్చిన రెండుమూడు కోరికలను నేను నా మంత్రులకు అందజేస్తాను. ఎందుకంటే అవి ప్రతి మునిసిపాలిటీకి, ప్రధానమైన సమస్యలు. పట్టణ ప్రజారోగ్యము పురపాలక సంఘపు ప్రధాన బాధ్యత. ఈ విషయంలో మీ రిదివరకే చేసిన సేవకు నేను ఆనందిస్తున్నాను. మీరు ముఖ్యంగా సేవ చేయవలసింది బీద ప్రజలకే. పైతరగతులవారు తమ అవసరాలను, సౌకర్యాలను తామే చూసుకోగలరు. కాని బీద ప్రజలు ప్రతి నిత్యావసరానికి మీ మీదనే ఆధారపడి వుంటారు. ఇటీవలి తుపానులో ఎక్కువగా నష్టపడిందీ వారే. ఎందుకంటే వారి నివాసములన్నీ పూరి గుడిసెలే. మచిలీపట్నం అక్కడ పల్లపు ప్రాంతాలలో వారి గుడిసె లుంచటం చేత వరదలకు అన్నీ కొట్టుకపోయినవి. ఈ మునిసిపాలిటీవారు బీదల పరిస్థితులను అభివృద్ధి చేయటానికి ఇదివరకే పెట్టించినందుకు నేను వారిని అభినందిస్తున్నాను. పాకీవారికి, కూలీలకు వారు ఇళ్లు కట్టించి ఇచ్చారు. ఇవి రోడ్లను సిమెంటు చేయించటంకంటే, పార్కులను, రహదారి బంగళాలను కట్టించటంకంటే ముఖ్యమైనవి. ఈ ఉదాహరణను అనుసరించవలసిందని స్థానిక సంస్థలన్నిటికి విజ్ఞాపన చేస్తున్నాను. ముందు బీదవారికి నివాసాలు కట్టించండి. పారిశుద్ధ్యాన్ని, జలసదుపాయాలను అధికం చెయ్యండి. పురపరిపాలన సవ్యంగా వున్నదా, లేదా అని పరీక్షించటానికి, ఎన్ని పార్కులున్నాయి, ఎన్ని అందమైన మునిసిపల్ భవనాలున్నాయి అనే విషయం దృష్టాంతంకాదు. తక్కువ తరగతులవారెలాంటిచోట్ల నివసిస్తున్నారు? వారి స్థితిగతు లెలావున్నాయి? ఇవే పురపరిపాలనకు సరియైన దృష్టాంతం. ఈ పనికోసం మనం కృషిచేస్తే మన ముఖ్యబాధ్యతను నెరవేర్చిన వారమేకాక, అనవసర వ్యయాన్ని తగ్గించుకుని, అవసర కార్యాలకై ధనం వెచ్చించిన వారము కూడా అవుతాము.—జైహింద్."

## ధాన్యం ధరలో వ్యత్యాసాలు

### లక్ష్మీకాంతమైత్రా ప్రకటన

అహమ్మదాబాదు, డిశంబరు 15: ఆహారధాన్యాల విచారణ సంఘంవారు నేడు సర్ కేపింపిణీ కేంద్రాన్ని, రేషన్ షాపులను, గిడ్డంగులను పరిశీలించారు.

అనంతరం పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ పై సంఘాధ్యక్షుడు పండిట్ లక్ష్మీకాంతమైత్రా, విదేశాలనుంచి వచ్చిన గోధుమ ధరలకున్నూ, దేశంలో పండిన గోధుమ ధరలకున్నూ చాలా తేడా వున్నదని, అట్లు యెందుకు వున్నది అర్థం కావడంలేదనీ అన్నారు.

అంతేకాకుండా కొన్ని ముతక ధాన్యాలుకూడా గోధుమకంటే ఎక్కువ ధర పలుకుతున్నాయి. ఇది ఇట్లా ఎందుకువున్నదో అర్థంకావడం మాత్రంలేదు, అని ఆయనఅంటూ, ఈ విషయాలను మేము బొంబాయికి పోయి నప్పుడు రాష్ట్రప్రభుత్వం వివరించగలదని అనుకుంటున్నాం.

దీనికితోడు ఈ రాష్ట్రంలో వస్త్ర ధరకూడా తక్కిన చోట్లకంటే ఎక్కువగావుంది. బెంగాలు మణుగు ఒకటికి 31 రూపాయల పై చిలుకు ఇక్కడ వుంటే మద్రాసులో 18 రూపాయల పై చిలుకు మాత్రమే వుంది ఇది గూడా అర్థం కాకుండావుంది.

ఇంకో విశేషమేమిటంటే, అహమ్మదాబాదు నగరంలో ధరలు చుట్టు ప్రక్కలలోవున్న పల్లెలలో ధరలకన్నా తక్కువగా వున్నాయి ఇదిగూడా విచారించవలసిన విషయమే.

ఈ కమిటీ వారు నేడు పూనా కు బయలుదేరిపోతున్నారు. వారక్కడనుంచి బొంబాయికి చేరకోకముందే మహారాష్ట్రంలో వున్న అదనపు జిల్లాలను, తరుగుజిల్లాలను చూచివస్తారు.

## స్విస్ అధ్యక్షుడుగా పియరీ ఎన్నిక

బెర్న్, డిశంబరు 15: స్విట్జర్లండ్ ఫెడరల్ సమాఖ్యకు, పెటిట్ పియరీని, పార్లమెంటు ఉభయ శాసనసభ్యులు, అధ్యక్షునిగా ఎన్నుకొనినవి. పియరీ 1944 నుంచి స్విస్ ప్రభుత్వంలో విదేశాంగమంత్రిగా ఉన్నాడు. 1950 సంవత్సరాంతంవరకు అధ్యక్షుడుగా ఉంటాడు.

# "ఏలును బట్టి ప్రభుత్వం రేషనింగు తొలగిస్తుంది"

## ఆహారశాఖామంత్రి రోష్‌విక్టోరియా అభిభాషణ: కర్నూలుజిల్లా ఆహారసంఘ సమావేశం

కర్నూలు, డిసెంబరు 14: మద్రాసు ఆహారశాఖామంత్రి జె. ఎల్. పి. రోష్ విక్టోరియాగారు కర్నూలు జిల్లా ఆహారసంఘ సమావేశంలో ప్రసంగిస్తూ ఆంధ్రదేశంలో వచ్చిన తుపాను భీభత్సమువల్ల బియ్యముకొరత చాల యేర్పడిందనియు, అయినను యీ విషయమై నిరుత్సాహపడవలసిన అవసరము లేదనియు ప్రభుత్వం తగు జాగ్రత్త తీసుకొంటున్నదనియు అన్నారు. సమావేశమునకు జిల్లాలోని ప్రముఖ అధికార అనధికారులు ప్రత్యేక ఆహ్వానము పై వచ్చియున్నారు.

జిల్లాకలెక్టరు పి. వి. చెలపతి మొదలియారుగారు మాట్లాడుతూ జిల్లా ఆహార పరిస్థితి సమీక్ష చేశారు. జిల్లాకు ప్రతినెల కావలసిన 1300 టన్నులు బియ్యము నకుగాను, ప్రస్తుతం 800 మొదలు 1000 టన్నులే పంపబడుతున్నవనీ, అదికూడ సకాలములో రానందున గ్రామ ప్రాంతాలకు అత్యవసరముగా యివ్వవలసినదికూడ యివ్వకుండా నున్నామనియు తెలుపుచు బోర్డువారు రేషన్ ప్రాంతములలో రెండు వారాలు నిల్వల నుంచుకొనవలెనని ఉత్తరువులు గావించియున్నమనిత్యావసరములకే సరిపోని పరిస్థితులలో పైనిబంధన ఆచరణ పెట్టలేకపోవుచున్నామనియు అన్నారు.

ఇటీవల వర్షాధిక్యమువల్లను, వరదలవల్ల సుమారు 4500 టన్నుల బియ్యము సుమారు 18లక్షల విలువగల మెట్టధాన్యములు పాడయిపోయినవని తెలియజేయుచు, దీనికితోడు సర్కారు జిల్లాలనుండి దిగుమతి కావలసిన బియ్యముకూడ తుపాను చేత రానందున జిల్లా కష్టపరిస్థితిలో గడుపవలసి వచ్చినదనియు, యిప్పుడుకూడ పైనుండి రావలసిన సరకు సకాలములో రాక, స్థానికముగా లభించు బియ్యమువచ్చే నెల ఆఖరువరకువచ్చు అవకాశము లేనందున మితవ్యయములో కాలము గడుపవలసియున్నదనియు అన్నారు.

మెట్టధాన్యముల విషయమై మాట్లాడుచు జిల్లాలో ఉత్పత్తి యెక్కువ కాబట్టి నిలువలు ధికమైనందున రామనాడు, సేలం, జిల్లాలకు సుమారు 2500 టన్నులు పంపినపిదపకూడ యింకను అంత సరకు బయటి ప్రదేశాలకు రవాణా అగుటకు సిద్ధముగా నున్నదని అన్నారు ఈ సంవత్సరముకూడా యెక్కువ ధాన్యము పండు అవకాశమున్నది కాబట్టి రైతులు తమ నిల్వలను అమ్ముటకు యిచ్చగించుచున్నారనీ, వాటిని కావలసిన ప్రదేశాలకు పంపుటకు వీలున్నదనీ అన్నారు.

కందులు, మినుములు జిల్లాకు కావలసినంత సరఫరా కానందున స్థానికముగా ఉత్పత్తి యగుదానిని కొని"అత్యాశాపరులైన వర్తకులు" యెక్కువ లాభములకు అమ్ముకొనుచున్నారు.

జిల్లాకాంగ్రెస్ అధ్యక్షులు నాయకంటి శంకరరెడ్డిగారు మాట్లాడుతూ, రాయలసీమ, నెల్లూరు ప్రాంతములలో మెట్టధాన్యములు యెక్కువ ఉత్పత్తియగుచున్నది కాబట్టి, యీ ప్రాంతములలో రవాణా సౌకర్యములకు ఉన్నటువంటి నిషేధం తొలగించవలెననీ నూతులకు యివ్వబడుచుండిన ధనసహాయము తిరిగి యిచ్చుటకు యేర్పాటులు గావింపవలెననీ బియ్యము తినువారు నూటికి 17 మందే నని తెలుపబడియున్న సంఖ్యను మార్చి, జిల్లాకు యెక్కువ బియ్యం వచ్చునట్లు మంత్రిగారు చూడవలెనీ అన్నారు. కర్నూలు పట్టణకాంగ్రెసు సంఘ అధ్యక్షులు కౌసుల తిమ్మయ్యగారు గాంధి ఆదర్శములకు వ్యతిరేకముగా కంట్రోల్సు, రేషనింగు అమలుపరచుచుండుట విచారకరమన్నారు. లోక సేవసంఘ అధ్యక్షుడు యస్. యస్. గుప్తాగారు మాట్లాడుచు రేషనింగు విధానమువల్ల, ప్రజలు తిండికి చాలక చీకటి బజారులోకొని బాట్లంపు కొనుచున్నారనీ, అందుచే దీనిని తక్షణం రద్దుచేయవలెననీ అన్నారు.

కర్నూలు రేషనింగు సలహాసంఘఅధ్యక్షుడు మేలాల కొండయ్యగారు, సరకులు మంచివిగా జిల్లాకు వచ్చినను, అవి పాడైపోయిన పిదపనే ప్రజలకు యిచ్చుచున్నారనీ, బియ్యం కప్పు మిగతవాటికి రేషనింగు తీసివేయుట ఉత్తమమనీ అన్నారు. జిల్లా కాంగ్రెసుసంఘ కార్యదర్శి కే. ఆంకిరెడ్డిగారు మెట్టధాన్య ఉత్పత్తిదారులకు కూడ బియ్యం రేషను కార్డులను యివ్వవలెనని కోరారు, అనంతరం ఆహారమంత్రిగారు మాట్లాడుచు ప్రభుత్వం ప్రజలకు బాధపెట్టుటకై రేషనింగును ప్రవేశపెట్టలేదనీ, అందరికీ కొంచమైనను సమానముగా పంచిపెట్టుటకై చేయబడిన యేర్పాటనీ, కాబట్టి పరిస్థితి మెరుగైనచో దీనిని తొలగించుటకు ప్రభుత్వం సిద్ధంగా నున్నదనీ తెలిపారు.

రేషనింగును వ్యతిరేకించేవారు ప్రభుత్వంపై తగుగు ప్రాంతి ప్రజలకుకూడ సరఫరా చేయవలసిన బాధ్యత ఉన్నదని గ్రహించిన బాగుండుననీ, వీటిని తొలగించవలెనన్న ఒక ప్రాంతమే గాక రాష్ట్రమొత్తం పరిస్థితిని లెక్కకు తీసికొనిన పిదపనె నిర్ణయము చేయవలెననీఅన్నారు. బియ్యములోటు పరిచేయుటకు యితర రాష్ట్రములనుండి సరకు రావలసి యున్నదని తెలుపుచు ప్రభుత్వం అవసరమైనచో నిర్బంధనములను తొలగించగలదని యు కర్నూలుజిల్లావంటి ప్రదేశములలో మెట్టధాన్యములు యెక్కువ ఉత్పత్తి కాబట్టి యీజిల్లాలో వీటికి కంట్రోల్, రేషనింగు రద్దుచేయ నిశ్చయించినానని సుడివిరి. ఈవార్త వినగానే సభ్యులు సంతోషపూర్వకముగా చప్పట్లు కొట్టిరి. ఒక జిల్లా నుండి యింకొక జిల్లాకు సరకులు వెళ్ళరాదన్న నిషేధమును గురించి జిల్లా కలెక్టర్ల నుండి రిపోర్టులు వచ్చిన పిదప ఒక నిర్ణయము జరుగుననియు, కొంతమంది కంట్రోల్సు విషయమై మహాత్ముని అభిప్రాయం తెలిపినను, మహాత్ముడు వ్యాపార విషయమై తెలిపిన అభిప్రాయములను వర్తకులు ఆచరణలో పెట్టనికారణమున ప్రస్తుత పరిస్థితినిబట్టి అవి ఉంచవలసినపని యేర్పడినదని అన్నారు.

కేంద్ర ప్రభుత్వం 1951 లోపల విదేశములనుండి సరకు దిగుమతి నిలుపదలచినది కాబట్టి, అంతరూ కొద్దిగనో గొప్పగనో ఉత్పత్తిచేసి ఆహార విషయములో దేశము స్వయంసమృద్ధిగా నుండునట్లు చేయుటకు తోడ్పడవలెనని ఉద్బోధించారు.

### కంట్రోళ్లపట్ల అసమ్మతి ప్రదర్శన

మద్రాసు ఆహార మంత్రిగారు నిన్న ఉదయం కర్నూలుజిల్లా హోల్ సేల్ స్టోర్సు సందర్శించి బయటికి వచ్చినపుడు అనేకమంది ప్రజలు కంట్రోల్సు, రేషనింగు విధానమునకు వ్యతిరేకముగా నినాదములు చేశారు. కర్నూలు లోక సేవసంఘ అధ్యక్షుడు యస్. యస్. గుప్తాగారు మంత్రిగారికి ఒక విజ్ఞప్తిని సమర్పించుచు కర్నూలుజిల్లాలో రేషనింగ్, కంట్రోళ్లను తీసివేసి, బియ్యమునకుమాత్రం చౌకడిపోలను యేర్పాటుచేయవలెనని కోరిరి. నినాదాలు చేసిన కొంతమంది వ్యక్తులు రాళ్ళతో కలిసియున్న బియ్యమును మంత్రిగారికి చూపించి యిటువంటి బియ్యమును రేషనింగుషాపులలో యిస్తున్నారని తెలియజేశారు. ఈ విషయమై తాము విచారించెదమని మంత్రిగారన్నారు.

హోల్ సేల్ స్టోర్సుకు రాకముందు మంత్రిగారు జీర్ణోద్ధారక నాగేశ్వరరావుగారి హరిజన వసతిగృహమును దర్శించిరి. సంఘ కార్యదర్శి యెన్. కే. లింగంగారు వర్షములవల్ల పడిపోయిన భవననిర్మాణమునకు ప్రభుత్వమునుండి తగు గ్రాంటు యిప్పించవలెననికోరిరి. తాను మద్రాసుకు పోగానే హరిజన మంత్రికి యీ విషయమై తెలిపెదననిరి. అనంతరం శ్రీ నాయకంటి శంకరరెడ్డిగారు జిల్లాబోర్డు భవనములో యిచ్చిన అల్పాహారవిందులో పాల్గొనిరి. మధ్యాహ్నం మంత్రిగారు నంద్యాల వెళ్లారు. (స్వ. వి.)

### కమ్యూనిస్టు చైనా పరిగణన తేదీ

#### నిర్ణయానికి కామన్వెల్తుతో బ్రిటన్ సంప్రదింపులు

లండన్, డిసెంబర్ 15: బ్రిటన్ కమ్యూనిస్టు చైనాను గుర్తించే తేదీని నిర్ణయించే నిమిత్తం కామన్వెల్తు ప్రభుత్వాలు సంప్రదింపులు ఇంకా జరుపుతున్నని నేటి రాత్రి ఒక విశ్వసనీయవర్గంద్వారా తెలిసింది.

చైనా కమ్యూనిస్టులను త్వరలోనే గుర్తించాలన్న సూత్రాన్ని బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించిందేకాని గుర్తించేది క్రిస్మస్ పండుగకు ముందో, తరవాతో, లేక కొలంబోలో సమావేశమయిన తరవాతో మాత్రం తెలియదు. నేటి ఉదయం జరిగిన మంత్రివర్గ సమావేశంలో ఆ విషయం నిర్ణయించబడలేదని తెలుస్తున్నది. తేదీ నిర్ణయం విషయమై విదేశాంగ మంత్రి బెవిన్ కామన్వెల్తు ప్రభుత్వాల అభిప్రాయాలను తెలుసుకుంటూవని తెలుస్తున్నది.

భారత ప్రభుత్వం బ్రిటన్ గుర్తించే నాకా ఆగకుండా తన గుర్తింపు ప్రకటించవచ్చునని తెలుస్తున్నది.

# 'ప్రజల తోడ్పాటును బట్టే ప్రభుత్వం ప్రణాళికలు అమలు జరుపుతుంది'

## బెజవాడ గోపాలరెడ్డిగారి అభిభాషణ: ఉత్తర విశాఖజిల్లాలో ఆర్థికమంత్రి పర్యటన

శ్రీకాకుళం, డిశంబరు 12:—ఉత్తర విశాఖజిల్లాలో పర్యటన చేయు నిమిత్తం నిన్న వుదయం ప్యాసింజరులో విశాఖపట్నం నుంచి, మద్రాసు ఆర్థిక శాఖామంత్రి గోపాలరెడ్డిగారు ఇచ్ఛాపురం వచ్చిరి. అక్కడ బాలికా పాఠశాల ఆవరణలో సన్మానసభ జరుపబడెను. సభలో ఇచ్ఛాపురం పట్టణ కాంగ్రెస్ సంఘమువారు, పంచాయతీ బోర్డువారు మంత్రిగారికి సన్మానపత్రములు సమర్పించిరి. తరువాత సపరివారంగా రాజపురం మీదుగా కవిటి గ్రామం వచ్చిరి. ఈపర్యటనలో మంత్రిగారి వెంట జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు గౌతు లచ్చన్న (ఎం. ఎల్. ఎ.) జి. కుమారస్వామి (ఎం.ఎల్.ఎ.) రొక్కం రామమూర్తి (ఎం.ఎల్.ఎ.) విశాలాంధ్ర మహాసభ ఉపాధ్యక్షులు న్యాయపతి నారాయణమూర్తి, శివల రామమూర్తి, రంగబాబు మున్నగువారు, తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులు, సబ్ కలెక్టరుగారు, జిల్లాపోలీసు సూపరింటెండెంటు మున్నగు ప్రభుత్వోద్యోగులు వున్నారు. కవిటిలో తాలూకా కాంగ్రెస్ పక్షమున సన్మాన పత్రము సమర్పింపబడెను. సన్మాన పత్రములో బాహుదా నదికి ప్రాజెక్టు కట్టాలనియూ, గొడామరి గెడ్డ ముఖద్వారం సముద్రమునకు పోయే సౌకర్యం చేయవలెననియూ, జనవరి 26 లోగా ఆంధ్రరాష్ట్రం స్థాపించుటకు కృషి చేయాలనియూ, ఉత్తర విశాఖకు చారిత్రకాధారముల దృష్ట్యా "కళింగ జిల్లా"అని పేరుంచ వలయుననియూ కోరిరి. 10 రూ॥లు శిస్తు చెల్లించు రైతులవద్ద నిర్బంధ ఋణసేకరణను వ్యతిరేకిస్తూ, 50 రూపాయలు జిరాయితీ శిస్తు చెల్లించిన వారివద్ద నారంభించి, భూస్వాముల వద్దను ధనికుల వద్దను ఋణసేకరణ చేయవలెనని కోరినారు.

తరువాత మంత్రిగారు సపరివారంతో బొరివంక, మాణిక్యపురం, తలతంపరల మీదుగా సోంపేట వెళ్ళినారు. తలతంపరలో పేద వ్యవసాయ కూలీలు మంత్రిగారికి స్వాగత మిచ్చి తమ పరిస్థితులను విన్నవించుకొన్నారు.

శ్రీకాకుళం, డిసెంబర్ 13: మద్రాసు ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు పాతపట్నం నర్సన్నపేట, శ్రీకాకుళం తాలూకాలలోని మిరియాపుట్టి, పర్లాకిమిడి, నాతిశాముఖలింగం, పార్వతీపురం, తిలారు, నరసన్నపేట, పల్లిపేట, కళింగపట్నం, పోలాకి, శ్రీకూర్మములలో పర్యటించి నిన్నసాయంకాలం శ్రీకాకుళంవచ్చారు.

ఆ సందర్భమున జరిగిన సభలో మంత్రిగారికి, శ్రీకాకుళం మ్యునిసిపల్ కౌన్సిలు ఉ॥ వి॥ జిల్లా కాంగ్రెసు, శ్రీకాకుళం హిందీప్రేమీమండలిహైస్కూలువిద్యార్థి సంఘము, చీపురుపల్లి తా॥ కాం॥ సంఘాలు సన్మానపత్రములు సమర్పించినవి.

మంత్రిగారు సన్మానపత్రములకు సమాధానం చెప్పుతూ ప్రభుత్వము ప్రజలనుబట్టి నడచునన్నారు. ప్రజల తోడ్పాటునుబట్టి ప్రణాళికలు అమలుజరుపట మవుతుందన్నారు. ఒక్క అమ్మకంపన్ను తప్పితే ప్రభుత్వానికి చెప్పతగ్గ ఆదాయం మరిలేదు.

బ్రిటీషువారు 150 సం॥ గాలకు 10 కోట్లకన్నా మనరాష్ట్రంలో స్కీములకు ఖర్చుచేయలేదు. మేము యీ రెండేళ్లలో ఆ పదికోట్లూ ఖర్చుచేశాము. హరిజనాభివృద్ధికి మద్యపానపు బాధ్యం వదలించడానికి కూడ ప్రభుత్వం కృషిచేసింది. ఈ సంగతి ప్రజలకు తెలియనిదికాదు."

"మీరు అనేకము అడగవచ్చును. అందుకు మీకు పూర్తిహక్కు వున్నది. కాని వాటిని అమలుపర్చటానికి ద్రవ్యమో? మంత్రులు మంత్రిగాళ్లు కారు. మనకు కావలసినంత ద్రవ్యం కూర్చడానికి ప్రజల అంగీకారంతోనే పన్నుల ద్వారానో అప్పులద్వారానో మేము సమకూర్చవలసియున్నది. ఈ రోజులలో ప్రతిజిల్లావారు తమ జిల్లాను వెనుకప్రాంతంగా ప్రకటించవలసిందని కోరటం పరిపాటి అయినది. ప్రతిజిల్లాలోను ఏదైనా ఒక తాలూకా కొంచెం వెనకపడకుండా ఉంటుందా? నరసన్నపేట, పోలాకి, శ్రీకాకుళం ప్రజలు యింకా జిల్లాలోని ప్రజలు అందరూ కలసి జిల్లా కాలేజికమిటీ స్థాపించి 2 లక్షల నిధి వసూలు చేసుకొని స్థలనిర్ణయం యూనివర్సిటీవారికి వదిలివేసినచో మీకు సహాయం చేయగలము." అని మంత్రిగారన్నారు.

"జమీందార్లకు నష్టపరిహారం ఎందుకు యివ్వాలి" అన్న ప్రశ్నకు జవాబు చెబుతూ మద్రాసు కార్పొరేషనునుండి విద్యుచ్ఛక్తి తీసుకొన్నందుకే 1½ కోట్లు ప్రభుత్వం ఇచ్చుకొన్నదనీ, అటువంటప్పుడు అనేక సంవత్సరాలుగా అనుభవిస్తున్న జమీందారుకు యేమీ నష్టపరిహారం యివ్వకిదే వాటిని తీసుకోవడం మిక్కిలి అనుచితమని తలంచే హైకమాండువారు కేంద్రప్రభుత్వంవారు నష్టపరిహారం యివ్వాలని నిర్ణయించారని అన్నారు.

గౌతు లచ్చన్నగారు యీ జిల్లాలో జరుగుతుండ క్షామాలు కలగడానికివాటికి ప్రాప్త లేకపోవడమేనని అన్నారు. వంశధార ప్రాజెక్టు త్వరలోనే కట్టబడునని మంత్రిగారు అన్నారు.

# రైల్వే ఆదాయం కేటాయింపు

## ఐదేళ్లపాటు అమలు

### గోపాలస్వామి అయ్యంగారి సవరణతీర్మానం

న్యూఢిల్లీ, డిశంబరు 15: రైల్వేశాఖ ఆదాయాన్ని, తక్కిన ప్రభుత్వఆదాయం నుంచి, 5 సంవత్సరములవరకూ ప్రత్యేకించివుంచటానికి గాను, రైల్వేశాఖామంత్రి గోపాలస్వామి అయ్యంగారు డిశంబరు 17 వతేదీన పార్లమెంటులో ఒక సవరణతీర్మానాన్ని ప్రతిపాదిస్తారు

ఈ తీర్మానాన్ని అనుసరించి, రైల్వే ఆదాయవ్యయాలు, ప్రస్తుతం జరుగుతున్న పద్ధతినే మరో 5 సంవత్సరాలవరకూ తక్కిన ప్రభుత్వఖజానానుంచి ప్రత్యేకించి వుంచుతారు. ఈ అయిదుసంవత్సరాలూ ప్రభుత్వం రైల్వే ఆదాయంనుంచి యేటేటా ఒకనిర్ణీతమైనమొత్తం తీసుకుంటూవుంటుంది.

ఇలాగంటే: ప్రభుత్వ ఆదాయంనుంచి రైల్వే శాఖక్రింద పెట్టుబడిపెట్టిన మొత్తం మీద, నూటికి నాలుగంతుల చొప్పున లెక్కచూసి తీసుకుంటూ వుంటారు. అయితే లాభాలు రావటానికి వీల్లేని కీలక మార్గాల నిర్మాణంకోసం ఖర్చుపెట్టిన మొత్తాలనుమాత్రంయిందులో కలిపి లెక్కచూడరు. అయిదు సంవత్సరం, ఈ పరిస్థితి మళ్ళీ సంస్కరించబడవచ్చును. రైల్వేశాఖవద్ద మిగిలివుండే ధనంతో రైల్వే అభివృద్ధినిధిని యేర్పాటుచేసి, (1) ప్రయాణీకులకు సౌకర్యాలు కలుగజేయటానికి, (2) రైల్వే కార్మికులకు యోగక్షేమాలను యేర్పాటు చేయుటానికి (3) రైల్వే ప్రాజెక్టుల నిర్మాణాలకూ వినియోగించుతారు.

1949 మార్చి 23 శాసనసభా నిర్ణయాన్ని అనుసరించి రైల్వే ఆర్థిక స్థాయీసంఘాన్ని యేర్పాటు చేస్తారు. రైల్వే ఆదాయ వ్యయాలను ఈ స్థాయీసంఘం అజమాయిషీ చేస్తూవుంటుంది. రైల్వే బడ్జెటు ప్రతిపాదన, ప్రభుత్వ సమగ్ర బడ్జెటు ప్రతిపాదనకంటే ముందే యేర్పాటుచేసి వివరాలను ప్రకటించుతారు. ఈచట్టం 1950 ఏప్రిల్ 1 వ తేదీనుంచీ అమల్లోకి వస్తుంది.

# విద్యావ్యాప్తికి భారత ప్రభుత్వ వ్యయం

## పార్లమెంటులో ఆజాద్ ప్రకటన

న్యూఢిల్లీ, డిశంబరు 15: కేంద్రప్రభుత్వం బడ్జెట్టులో 8 9% మాత్రమే విద్యకోసం కేటాయించబడుతున్నది అని భారత విద్యామంత్రి మౌలానా అబుల్‌కలాం ఆజాద్ నేడు పార్లమెంటులో సభ్యులు వేసిన ప్రశ్నలకు సమాధానమిస్తూ వెలడి చేశారు.

పూర్వం విద్యకోసం కేంద్రప్రభుత్వం 6 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టేవి. ఇప్పుడు పొదుపు పద్ధతులు అములుపరచడంవల్ల అది 4.51 కోట్లకు తగ్గించబడింది.

అయినా దేశంలో వయోజనులలో విద్యాగంధాన్ని ప్రబలంచేసే నిమిత్తం ప్రభుత్వం ఒక దశవర్ష ప్రణాళిక తయారు చేసింది. దీనికి 266 కోట్ల రూపాయలు అవుతుందని అంచనాలు వేశారు.

దేశంలో సెకండరీ విద్యావిధాన విషయమై పరిశీలన జరిపేందుకున్నూ, ఆ పరిశీలన ఫలితంగా తేలిన సారాంశాలతో ఒక రిపోర్టుచేయగలందులకున్నూ, ప్రభుత్వం ఒక సెకండరీ విద్యా విచారణ సంఘాన్ని ఏర్పాటుచేయబోతున్న దనికూడా ఆయన ఈ సందర్భంలో సభ్యులకు తెలియజేశారు.

ఈకమిషన్ రిపోర్టు అందిన తర్వాత రాష్ట్రాలలో అనూచనలను అములుపరచడాన్నిగూర్చి ప్రభుత్వం విచారిస్తుంది.

శ్రీ సేఠ్ గోవిందదాస్ వేసిన ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ శాస్త్రీయమైన శబ్దాలకు సరియైన జాతీయ భాషాశబ్దాలు నిశ్చయించడాన్ని గూర్చి ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తున్నదని మౌలానా సాహెబ్ తెలియజేశారు.

అంతేకాకుండా హిందీలో శాస్త్రగ్రంథాలు, అందులోంచి దీపావళి అనే ఒక పత్రికనుకూడా ప్రకటించాలని ప్రభుత్వం భావిస్తున్నదని గూడా మౌలానా ఆజాద్ అన్నారు.

సేఠ్ గోవిందదాస్: కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలుకూడాఇటువంటి ప్రయత్నాలుచేస్తూన్నవి. ఈపథకాలన్నింటిని ఒకదారికి తీసుకురాకపోతే, ఈ వ్యవహారమంతా ఏకికిరాకే, యమునా తీరేగా అవుతుందన్న విషయం మీరు గుర్తించారా?

మౌలానా ఆజాద్: గుర్తించాం. అందువల్లనే ఈవిషయంలో ఒక కేంద్ర సంఘాన్నిగూడా నియమించాలను కుంటున్నాం.

# హైద్రాబాద్ కాంగ్రెస కార్యవర్గం

## స్వామీజీ ప్రభృతుల ఏకగ్రీవ ఎన్నిక

హైద్రాబాదు, డిసెంబరు 15: అఖిల హైదరాబాదు కాంగ్రెసుకమిటీకి, స్వామీ రామానందతీర్థ, హరిశ్చంద్ర హెడా, డా॥ జి. ఎస్. మేల్కోట్, వి. బి. రాజు, ఎస్. కె. వైశంపాయన్, వినాయకరావు, ఎస్. కె. రావు, ధరణీశ్వర్ సంఘి, అబుల్ హసన్ సయ్యదాలీ, నరేంద్రజీ గోపాలరావు ఎక్బోట్, బి. వెంకటస్వామిగారు ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. స్వ. వి.

## కీ. శే. నవాబ్ ఆలీ కుటుంబానికి రాజాజీ సంతాపసందేశం

హైదరాబాదు, డిసెంబరు 15: హైదరాబాదులో ప్రముఖ ఇంజనీరైన నవాబు ఆలీ నవాజ్ జంగ్ గారి మృతికి చింతిస్తూ గవర్నరు జనరల్ రాజగోపాలాచారిగారు నవాబాలీ కుమారునికి సంతాప సందేశం పంపించారు. ఈ సందేశాన్ని అందజేస్తూ ముఖ్య మంత్రి ఎమ్. కె. వెల్లోడికూడా తన సంతాపాన్ని తెలియజేశారు. (స్వ. వి.)

## సంస్థాన కాంగ్రెసు కార్యవర్గ సభ్యుని రాజీనామా

హైదరాబాదు, డిసెంబరు 15: హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడు కె. వి. నరసింగరావు గారు నేడు తమ పదవికి రాజీనామా యిచ్చారు. అఖిలభారత కాంగ్రెసు హైకమాండు స్థానికజనులకు దారి తీస్తున్నదనీ, స్వామీ రామానంద తీర్థ గారి అభ్యుదయ వైఖరిని వారు సమర్థించటం లేదనీ, అందువల్లనే సంస్థాన కాంగ్రెసులోని ఉభయపక్షాల మధ్య రాజీ కుదర్చటంలో స్వామీజీని వారు అధ్యక్షపదవికి సమర్థించ లేదనీ, ఈ కారణాలవల్ల తాను రాజీనామా యిస్తున్నాననీ ఆయన అన్నారు. స్వ. వి.

## బీబీనగర్ కేసు విచారణ

### ముద్దాయి అంతరపు పిటిషన్లకు న్యాయస్థానం నిరాకరణ

హైదరాబాదు, డిశంబరు 15: బీబీనగర్ కేసును విచారణచేయటానికి ప్రత్యేక న్యాయస్థానానికి అధికారంలేదని ప్రథమ ముద్దాయి కాశింరజ్వీ పెట్టుకున్న పిటీషనుపై ఇప్పుడు తీర్పుగాని, ఉత్తర్వుగాని ఇవ్వటానికి ప్రత్యేక న్యాయస్థానం నిరాకరించింది.

ఈ కేసులో ముద్దాయిలపై ఆరోపణలు సరిగా తయారుచేయబడలేదనీ, మూడింటి కంటె ఎక్కువ నేరాలకు ఒకేసారి ముద్దాయిలను విచారణ చేయరాదనీ డిఫెన్సువారు పెట్టిన మరో పిటిషనునుకూడా న్యాయస్థానం త్రోసివేసింది.

బీబీనగర్ కేసును విచారించటానికి ప్రత్యేకన్యాయస్థానానికి అధికారమున్న విషయాన్ని హైకోర్టు ధ్రువపరిచేదాకా విచారణ వాయిదా వేయవలెనని మస్తగు ఇతర ముద్దాయిలు పెట్టిన దరఖాస్తును కూడా న్యాయస్థానంవారు త్రోసివేశారు.

# నెహ్రూ నమ్రత: అమెరికా ఆశ్చర్యం

## కోటంరాజు రామారావుగారి ప్రసంగం

పాట్నా, డిసెంబర్ 14: ప్రధాని పండిత నెహ్రూ భారతదేశ ప్రతిష్ఠను ఇనుమడింప జేశారని నెహ్రూతో అమెరికాలో పర్యటించిన సర్చ్‌లైటు సంపాదకులు శ్రీ కోటంరాజు రామారావుగారు పత్రికా యజమానులు వారి గౌరవార్థమై గావించిన సత్కారసభలో ఉపన్యసించుచు చెప్పిరి.

"పండిత నెహ్రూ ఆంగ్లభాషా కోవిదత్వము అమెరికనులను ఆశ్చర్యనిమగ్నులనుగా చేసెను. తన కీర్తి ఆకసము నంటుచున్నప్పటికీ తాను గాంధి మహాత్ముని శిష్యత్వమే తనకీ ఉన్నతస్థితి చేకూర్చినదని, తన దేశప్రజల అనురాగాతిశయమే తనకట్టి ఔన్నత్యము చేకూర్చినదని పండిత నెహ్రూ నమ్రభావమున చెప్పిన మాటలు వారి హృదయములను ఆకర్షించినవి. అమెరికాకు వెళ్లి డాలరకై యాచించనివాడు ఒక్క పండిత నెహ్రూగారేనని నేను కలిసికొని మాటాడిన అమెరికనులందరూ చెప్పిరి" అని శ్రీ రామారావుగారనిరి."

బీహారు ప్రధాని శ్రీ కృష్ణ సిన్హాగారు మాట్లాడుచు డాలర్లు యాచించుటకు ప్రధాని నెహ్రూ అమెరికాకు వెళ్ళలేదని చెప్పిరి. నూతనముగా స్వాతంత్ర్యం పొందిన భారతదేశ నాయకునిగా, భారతదేశ సందేశమును ప్రపంచమున కొసంగుటకు పండితనెహ్రూ అమెరికా వెళ్ళెనని, ఈ కర్తవ్యమును ఆయన సరిగా నిర్వర్తించెనని బీహారు ప్రధాని శ్రీ కృష్ణ సిన్హాగారు చెప్పిరి.

## టెండరు నోటీసు

హిందూపురం మునిసిపాలిటి

క్రింద సూచింపబడిన తేదీయందు, 1949-50వ సంవత్సరమునకు హిందూపురం మునిసిపల్ ఎలెక్ట్రికల్ అండర్‌టేకింగుకు కావలసిన ఎలెక్ట్రికు సామానులను సప్లయి చేయుటకు 29-12-49వ తేదీ సాయంత్రము 4 గంటలవరకు సీల్డు టెండర్లను పంపుకోవచ్చును. టెండరు ఫారమును, స్పెసిఫికేషనును దరఖాస్తుపైన హిందూపురం మునిసిపల్ ఆఫీసు నుండి పొందవచ్చును.

10-12-1949. కమీషనరు.

## టెండరు

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

బిట్రగుంటలో సిబ్బందికి 4 యూనిట్ల 'A' టైపు క్వార్టర్సు కట్టుటకు సీలు చేసిన టెండర్లు 10-1-1950 తేది మంగళవారము పగలు 12 గంటలవరకు మద్రాసు పార్కు టౌనులోని ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే, చీఫ్ యింజనీరుగారిచే తీసుకొనబడును.

సెట్టు 1-కి పదిరూపాయల వంతున చెల్లించి, దరఖాస్తుమీద చీఫ్ యింజనీరు గారినుండి టెండరు ఫారములు పొందవచ్చును. ఈ సొమ్ము వాపసుచేయబడదు.

మద్రాసు, ఎం. అండ్ ఎస్.ఎం. రైల్వే ఫైనాన్షియల్ అడ్వయిజర్ అండ్ చీఫ్ అకౌంట్సు ఆఫీసరుకు ముందుగా రు 1,800/-లు ధరావతు సొమ్ము చెల్లించవలెను.

కంట్రాక్టు మొత్తము విలువ షుమారు రు. 90,000/-

## ఉబ్బసం మందు

శంకర్ శంకిణి బూటి

దీనిని 4-1-50 పౌర్ణమినాడు ఒక్కమోతాదు తీసుకుంటే ఉబ్బసం నయమవుతుంది. జాబులు యింగ్లీషులో గాని తెలుగులో గాని వ్రాయండి.

Chitrakot Sri Govind Ayurvedashram
P. O. Karwi, Dt. Banda U. P.

## టెండరు నోటీసు

గుంటూరు టుబాకో మార్కెట్ కమిటీ, గుంటూరు

గుంటూరులోని మార్కెట్ యార్డులో మెటల్ రోడ్లు వేయుటకు గాను 29-12-49 తేది పగలు 2 గంటలవరకు యీ క్రింద సంతకముచేసిన వారిచే సీల్డు వేయబడిన టెండర్లు మార్కెటు కమిటీ ఆఫీసులో స్వీకరించబడును.

టెండరుకు సంబంధించిన అన్ని వివరాల షెడ్యూల్సు, స్పెసిఫికేషన్లు మొదలైనవి గాను; ఆఫీసు పనిచేసే రోజుల్లో ఉదయము 11 గంటలనుండి సాయంత్రము 5 గంటల లోపల యేరోజున అయినా రు 3-0-0 లు చెల్లించి పొందవచ్చును. (ఈడబ్బు రిఫండ్ యివ్వబడదు.

గుంటూరు యింపీరియల్ బ్యాంకులో గాని, జిల్లాలోని గవర్నమెంటు ట్రెజరీలలో గాని రు 500/-లు యీ క్రింద యివ్వబడిన క్రెడిట్ హెడ్‌కు జమకట్టి, టెండరు తోపాటు చలానా పంపుకోవలెను.

క్రెడిట్ హెడ్

"డిపాజిట్ ఆఫ్ లోకల్ ఫండ్సు - అదర్ ఫండ్సు - అదర్ మిసిలేనియస్ ఫండ్సు - మార్కెట్ కమిటీ ఫండ్సు"

టెండర్లను అంగీకరించే విషయములోనూ, పనిని నిర్వహించే విషయములోనూ గల అన్ని సందర్భాలలోనూ మార్కెట్ కమిటీవారిదే తుది నిర్ణయము.

(సం) యం. వెంకట్రామయ్య,
14-12-49 సెక్రటరీ, గుంటూరు.

## ప్రకటన

నాకు భర్తయున్ను, భీమవరం తాలూకా సిద్ధాపురం కాపురస్థులు గొట్టుముక్కల వెంకట్రామరాజుగారి కు॥ సత్యనారాయణ రాజుగారు దుర్వ్యసనములలోనై, 3 సంవత్సరముల క్రితం యిల్లు విడచి, గ్రామాంతరములలో తిరుగుచూ, అవ్యవహారికమైన ఋణములు చేయుచున్నట్లు తెలియుచున్నది. సదరు సత్యనారాయణరాజుకు, రామకృష్ణంరాజు అనే ఒక మైనరు కుమారుడు కలడు. మైనరు తల్లినైన నాయొక్క legal guardianship లో వున్నాడు. కాబట్టి మైనరు తండ్రి చేసే ఋణములు, అన్యాక్రాంతములు వగైరాలు మైనరునిగాని మైనరు ఆస్తిని గాని బైండుచేయవని యిందుమూలముగా అందరికి తెలియచేయడమైనది.

గొట్టుముక్కల రాజమ్మ,
10-12-49. సిద్ధాపురం.



# భారత నౌకా దినోత్సవం

## నెహ్రూ, రాజాజీ ప్రభృతుల సందేశములు

న్యూఢిల్లీ, డిసెంబరు 17: భారతనౌకాదళోత్సవ సందర్భమున గవర్నర్ జనరల్ శ్రీ రాజగోపాలాచారి, ప్రధాన మంత్రి నెహ్రూ, రక్షణశాఖా మంత్రి సర్దార్ బల్దేవ్ సింగ్, నౌకాదళ సర్వసేనాని వారీ క్రింది సందేశముల నొసగిరి.

### గవర్నర్ జనరల్ సందేశం

'భారత నౌకా శాఖ ఉద్యోగులూ, సైనికులూ దేశభక్తి యుతమైన మంచి సంప్రదాయాన్ని సృష్టించటానికి ప్రయత్నించాలి. మంచి క్రమశిక్షణ, బ్రిటిష్ నౌకా శాఖవలే, ప్రభుత్వం పట్ల పరమ విశ్వాస భక్తులూ అలవరచుకోవాలి. భారత నావికుల నందరనూ భగవంతుడు వర్ధిల చేయుగాక! వార్షిక నౌకా దినం, సంతోషానికీ, విశేష విశ్వాసాలకూ ఆస్కారం కాగలదని ఆశించుచున్నాను.

(సం.) సి. రాజగోపాలాచారి,

### ప్రధాని నెహ్రూ సందేశం

'దేశం యొక్క విస్తీర్ణాన్ని బట్టి చూసినా, సైనిక బలం యొక్క విస్తరణాన్ని బట్టి చూచినా మన నౌకా శాఖ చాలా చిన్నగిగా వుంది. ఏవో ఓడ రేవుల ప్రాంతాలలో తప్ప దీని సంగతి యెవ్వరికీ తెలియదు. మన ప్రజలు దీన్ని గురించి, ఇతోధికంగా తెలుసుకోవలసి వుంటుంది. అది మన రక్షణ శాఖలో చాలా ప్రధానమైన భాగం, ఆ శాఖ అధికారులనూ, యితర సైనికులనూ యెక్కడ చూచినా నాకు వారియందు మంచి సదభిప్రాయం కలుగుతున్నది. వాళ్లంతా చాలా ప్రతిభా వంతులు. వీరిని గురించి విదేశాల వారు కూడా పొగడటం విన్నాను.

డిసెంబర్ 17వ తేదీన ఈ నౌకా దినోత్సవం జరగటం నాకు చాలా ముదావహంగా వున్నది. ఈ ఉత్సవం, నౌకా శాఖ వారికీ ప్రజలకూ సాన్నిహిత్యాన్ని యేర్పరచగలదని ఆశించుచున్నాను'.

(సం.) జవహర్‌లాల్ నెహ్రూ.

### రక్షణశాఖా మంత్రి సందేశం

'స్వాతంత్ర్యలబ్ధి అనంతరం ప్రథమ దఫాగా మనమీ నౌకాదినోత్సవం జరుపుకుంటున్నాం. ఈ ఉత్సవ తరుణంలో ఈ సందేశాన్ని అందజేయ గలిగినందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది. స్వాతంత్ర్యం కేవలం గౌరవము మర్యాదలను చేకూర్చటమేగాక, యెన్నో బాధ్యతలను కూడా మనకు కలిగిస్తుంది. సముద్రతీరాలనూ సముద్రవ్యాపారాలనూ రక్షించటం అలాంటి బాధ్యతలలో అతి ప్రధానమైనది. ఈ బాధ్యతను మన నౌకా శాఖ వహించవలసి వుంటుంది. ఏ పరిస్థితిలోనైనా, మననౌకాశాఖ తన బాధ్యతను నిర్వహించుకో గలదనే విశ్వాసం నాకు వుంది. అప్పుడే మంచి పురోగమనం కనిపింపగలదు. మన నౌకా దళాలు యే ప్రాంతానికి వెళ్ళినా, స్నేహ సౌమనస్యాలను పెంపొందించుకో గలుగుతున్నారు. మన దేశం అభివృద్ధి చెందాలంటే మనం సముద్రవాణిజ్యాన్ని పెంపొందించుకో వలసి వుంటుంది. మన సముద్రపరిసరాలను నౌకాశాఖ సురక్షితంగా చేస్తూవుంటే మన వాణిజ్య నౌకలు సప్తసముద్రాల మీదకీ పోయి వ్యాపారం చేస్తయ్.

(సం) బలదేవ్ సింగ్.

### నౌకాదళ సర్వసేనాని సందేశం

స్వాతంత్ర్యలబ్ధి అనంతరం నౌకాదినోత్సవం జరగటం మొదటిసారి. రాయల్ ఇండియన్ నౌకాదళంలోని అధికారులకు సైనికులకు నా అభినందనాలు తెల్పుతున్నాను.

'భారతదేశ రక్షణకు బలమైన నౌకా శాఖను నిర్మించవలసిన బాధ్యత మనమీద ఉన్నది. మనం త్వరితగతిని అభివృద్ధిచేసుకోగలుగుతున్నాం. మనలోవున్న ప్రతి ఒక్కరూ ప్రధానమైన పాత్రవహించి ఈ మహాకార్యాన్ని విజయవంతం చేయవలసి వుంటుంది.

2. నౌకలను కొనటమంటే తేలికగా కొనవచ్చు; కాని యుద్ధరంగంలో వాటిని నడపటానికి, యుద్ధనిర్వహణ చేయటానికీ ప్రతిభావంతులు లేకపోతే ప్రయోజనం వుండదు. అందుచేత ప్రతిభావంతులు కావటానికి, ప్రయత్నించవలసి వుంటుంది. యొక్కవారి సైనికబలమూ, ధైర్యగరిమా అలవరచుకోవలసి వుంటుంది. విజయసాధనలో ఇవిరెండూ అత్యంత అవసరం. మీమీద మహోత్తరమైన బాధ్యత వుంది. మీలో చాలామందిరానున్న దినాలలో నాయకత్వం వహించవలసివుంటుంది. అందుకు అనువైన గుణసంపదనూ, సమర్థతనూ ఇప్పటినుంచీమీరుఅలవరచుకోవాలి. నాయకత్వంలోకి పోదలచినవారు క్రిందివారి విశ్వాసాలను సంపాదించటం నేర్చుకోవాలి; అచంచలమైన మనోధైర్యంవుండాలి; త్వరితంగా నిర్ణయానికిరాగల సమర్థతవుండాలి: కల్లోలస్థితి చెలరేగినప్పుడు ప్రశాంతంగా వర్తించగల ప్రతిభవుండాలి, మానవస్వభావాన్ని గురించిన సంపూర్ణమైన పరిజ్ఞానం వుండాలి.

3. శాసించటం నేర్చుకునేముందు, క్రమశిక్షణకు బద్ధులై ప్రవర్తించటం నేర్చుకోవాలి. ఎందుచేతనంటే యుద్ధశాఖలో క్రమశిక్షణలో వర్తించటమనేది హృదయపూర్వకంగానూ భక్తి విశ్వాసాలతో కూడినదిగానూ వుండాలి.

4. ఒక లోకవృత్తంవుంది—'పడవలనుబట్టి ఓడయొక్క మంచిచెడ్డలు తెలుస్తాయి' అంటారు. అలాగే మీ మంచి చెడుగులు ఒడ్డుకువెళ్లిన తరుణంలో మీ ప్రవర్తననుబట్టి అంచనా వేస్తారు. మీరు, యితర విదేశాలకు వెళ్ళినప్పుడు, మీరు ఇంచుమించు అనధికార రాయబారులుగా వుంటారు. మీ దేశంయొక్క గౌరవమర్యాదలన్నీ మీ చేతులమీదవుంటవి. మీ సత్ప్రవర్తననుగురించి మీరు వెళ్ళివస్తున్న అన్ని ప్రాంతాలనుంచీ నాకు వార్తలు వస్తున్నయ్. ఇందుకు నాకు సంతోషంగా వున్నది.

5 మీ కందరికీశుభం చేకూరాలని కోరుతున్నాను. బలమైన భారతీయ నౌకను నిర్మించే మహాకార్యంలో మనమంతా నిమగ్నులం కావాలి.



త్వరలో విడుదల కానున్న వాహినీవారి 'గుణసుందరి కథ' చిత్రంలో ఒక హాస్యసన్నివేశం

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్ | 'గరల్స్ స్కూల్' |
| వెల్లింగ్టన్, ప్రభాత్ | 'అపూర్వ సహోదరగళ్' |
| సెలెక్టు | 'లక్ష్మీ' |
| బ్రాడ్వే, గెయిటీ | 'ఇన్సపక్టర్' |
| పారగన్ | 'జెవకొలాండ్' |
| సన్, పయనీర్ | 'లైలా మజ్ను' |
| మహారాణి | 'కన్నియిన్ కాదలీ' |
| బ్రాడ్వే | 'షెహనాయ్' |
| చిత్ర | 'ఫూల్ కా ఫూల్' |
| Casino: | 'The Big Steal' |
| Minerva: | 'Adventures of Don Juan' |
| NewGlobe: | 'Colorado Territory' |
| New Elphinstone: | 'In Old Chicago' |
| Roxy: | 'Jungle Jim' |

## ఫిల్ము వార్తలు

విజయా ప్రొడక్షన్సువారు ప్రసాద్ దర్శకత్వాన 'షావుకారు' అనే తెలుగు చిత్రాన్ని తీస్తున్నారు.

* * *

వాహినీ ఫిలింసువారి గుణసుందరి కథ త్వరలో విడుదల కానున్నది.

## 1950 క్యాలెండర్లు

జ్యోతి కాంఫర్‌వర్క్సు ప్రొప్రయిటర్ ఎ పొన్నుస్వామిగారు ప్రకటించిన దినచరి 1950 క్యాలెండరు, మైలాపూరు అఖిల భారత సాయిసమాజ్ వారి నెలవారీ క్యాలెండర్లు, బొంబాయి మెంటాల్జి కావర్క్సువారి మాసవారి క్యాలెండరూ మా కార్యాలయానికి చేరినవి.

## అంతర్జాతీయ వైజ్ఞానిక మండలి

బొంబాయి, డిసెంబర్ 14: డిసెంబరు 28వ తేదీనుంచి, జనవరి 1 తేదీ వరకూ, బొంబాయిలో, అంతర్జాతీయ వైజ్ఞానిక మండలి భారత జాతీయశాఖ వారి సమావేశాలు యేర్పాటుచేయబడుతున్నయ్. ఈ సమావేశాలకు మౌలానా అజాద్ అధ్యక్షత వహించుతారు.

మౌలానా చిత్రకళా ప్రదర్శనానికీ, 'డాక్ సోమనాథ్' అనే 'బాలెట్' ఆరంభప్రదర్శనానికీ అధ్యక్షతవహించుతారు. ఈ ప్రదర్శనాన్ని కె. యం. మున్షీ గారు వ్రాసిన నవలను ఆధారంగా తీసుకుని తయారుచేశారట.

## ప్యాపలిలో క్షయ ఆస్పత్రి నిర్మాణం

### అసెంబ్లీలో ప్రశ్నోత్తరములు

మదరాసు, డిసెంబరు 16: కర్నూలు జిల్లా ప్యాపలిలో క్షయ ఆస్పత్రిని కట్టవలెననే ప్రతిపాదన యున్నదనియు, మదనపల్లి శానిటోరియం సూపరింటెండెంటు, గవర్నమెంటు క్షయ ఆస్పత్రి సూపరింటెండెంటు శ్రీ కె. వాసుదేవరావు వెళ్లి స్థలపరీక్ష చేసిరనీ, వారు శానిటోరియం కట్టుటకు స్థలము అనుకూలముగా వున్నదనియు అయితే తగిన నీటి సౌకర్యము లేదని తెలిపిరనియు మదరాసు ప్రభుత్వ ప్రజారోగ్య మంత్రి డాక్టర్ రాజన్ నేడు అసెంబ్లీలో శ్రీ నివర్తి వెంకటసుబ్బయ్యగారికి తెలిపిరి.

ప్రభుత్వము పై ఉద్యోగుల నివేదికను పరిశీలించి మితవ్యయ చర్యలక్రింద ఈ స్కీము ప్రస్తుతమునకు ఆపి వేయబడినదని కూడా డా॥ రాజన్ అనిరి.

మహబూబ్ ఖాన్: ఎప్పటికి పూర్తి అవుతుంది? ఎంతమంది రోగులకు ప్రవేశము వుంటుంది?

మ: అసలు శానిటోరియం నిర్మాణ విషయమే పరిశీలనలో వున్నది.

నటేశన్: వున్న శానిటోరియం స్థితే బాగా లేనప్పుడు కొత్తవాటిని గురించి ఆలోచన దేనికి?

మ: గౌరవసభ్యుని అభిప్రాయం సరికాదు.

శ్రీ నటేశన్: మదరాసు శానిటోరియములో రోగులు వరండాలలో క్రింద పడుకు౦డవలసివస్తోందిగదా?

మ: ఇందువల్లనే కొత్త శానిటోరియము నిర్మాణం అవసరమని తెలియగలదు.

శ్రీ సామ్యూయల్: బోరింగు నూతుల వల్ల తగిన నీరు లభించిన సంగతి ప్రభుత్వమునకు తెలియునా?

మ: నీరు లభించి త్రాగుటకు పనికి వచ్చేయెడల శానిటోరియం నిర్మాణము గురించి పూనుకొనగలము

## బావుల సబ్సిడీ

మదరాసు, డిసెంబరు 16: రివెన్యూ మంత్రి నేడు అసెంబ్లీలో బావుల సబ్సిడీ మంజూరు చేయుటకుముందు రివెన్యూ అధికారులనుండి సర్వే త్రవ్వదలచిన స్థలములో పాతబావి లేదని ధృవపత్రములు దాఖలు చేయనవసరము లేదనియు, అయితే మంజూరు చేయుటకు పూర్వము స్థలమును రివెన్యూ ఇన్‌స్పెక్టరు డిప్యూటీ తహశీల్దార్ పరిశీలించవలసి యున్నదని తెలిపిరి.

అనవసరముగా జాగు అవుతున్నదని ఫిర్యాదులు అందినవనీ సబ్సిడీ కొరకు దరఖాస్తు చేసిన తరువాత సాధ్యమైనంత శీఘ్రముగా డిప్యూటీ తహశీల్దార్ స్థలపరిశీలన పూర్తి కావలెనని బోర్డు కలెక్టర్లకు ఉత్తర్వులు జారీచేసినదనికూడ రివెన్యూ మంత్రి శ్రీ యస్. గోవిందస్వామి ప్రశ్నకు జవాబు ఇచ్చిరి

## రాష్ట్రంలో ప్రౌఢశిక్షణ

రాష్ట్రములో ప్రౌఢశిక్షణ ప్రచారమునకు 1948/49 లో రు 1,54,500 1949/50 లో రు 1,55,500 ప్రత్యేకించబడెను. రాష్ట్రములో 450 వయోజన విద్యాలయములు మంజూరు అయినవనీ 230 విద్యాలయములు ప్రారంభించబడెననీ విద్యామంత్రి శ్రీ మాధవమీనన్ నేడు అసెంబ్లీలో తెలిపిరి.

ప్రౌఢశిక్షణ బాధ్యత విద్యాశాఖ డైరెక్టరుపై గలదు. ప్రభుత్వమునకు ఈవిషయములో సలహానిచ్చుటకు రాష్ట్రవిద్యా సలహా సంఘమువారి ఉపసంఘమొకటి యున్నది. ఆంధ్రప్రాంతములో ఒకఅనధికారి ఈ కార్యక్రమములో సహాయము చేయుచున్నారని శ్రీ కన్నియప్పనకు విద్యామంత్రి జవాబు ఇచ్చిరి.

కేంద్రప్రభుత్వము ప్రౌఢశిక్ష నిమిత్తం రాష్ట్రప్రభుత్వము వరిచిత మొత్తము ఇచ్చేవరకుమీద రు 1,57000లు గ్రాంటు ఇచ్చుచున్నదనికూడ మంత్రిగారు తెలిపిరి.

# వారఫలాలు

డిసెంబరు 18 వ తేదీ మొదలు డిసెంబరు 24 వ తేదీవరకు

### గ్రహస్థితి

రవి బుధులు (ధనుస్సు) కుజుడు (కర్క) గురుశుక్రులు (మకరం) శని (సింహం) రాహువు (మీనం) చంద్రుడు (వృశ్చిక ధనుర్మకరకుంభాల్లో) 19 శనిచంద్ర కుజ చంద్ర. రవికుజ (కేంద్రం) 20 రవిబుధ (కేంద్రం) 21 బుధచంద్ర (యుతి) శని చంద్ర (కోణం) 22 కుజచంద్ర (కోణం) గురుచంద్ర (యుతి) 23 శుక్రచంద్ర (యుతి) 24 బుధశని (కోణం.)

### ధరలు

ప్రత్తి (జారిల్లా) నూలూ వస్త్రాలూ రెడీమార్కెట్టు ధర కొంత తేజీలో యుంటుంది.

వెండి-బంగారాలు

20.3 గంటలకు తేజీ కలిగి మరల తగ్గుతుంది. 21.1 గంటకు తేజీ వస్తుంది. కాని నిలువదు. 24 రెండువైపులా వేగంతో తిరుగుతుంది.

వాటాలు

మార్కెట్టు స్వల్పవ్యత్యాసాలతో నిలుకడ.

ధాన్యములు - ఆహారవస్తువులు

పొట్టుధాన్యములూ, చింతపండూ, పసుపూ నెయ్యి కొంత తగ్గుతవి. అల్లే గడ్డదినుసులూ పచ్చి కూరలూ కూడా, బెల్లము కొంత హెచ్చుతుంది.

### లగ్నఫలాలు

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1వపాదం)

ఈ వారంలో పరిస్థితులు గత వారం లోకన్నా ప్రోత్సాహకరంగా యుండ గలవు. 18, 19 ల్లో ప్రయాణం కార్యావసరంపై అధికార్లనూ, గౌరవ్యులనూ చూడటం లాభకరం. 19, 20, 21 పరిష్కారాలూ వ్రాతలూ కొనుగోలు విక్రయాలూ ముగించండి. కంట్రాక్టులూ వప్పందాలూ కుదుర్చుకొనడానికి బాగా యుంటుంది. 22, 23 ల్లో ఖర్చులకు మితి యుండదు. కాని సంతోషంతో అప్తులతో కులాసాగా కాలంగడుపుతారు. 22 శుభవార్త.

**వృషభం** (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర, 1 2. పాదాలు)

ఈ వారంలో 18, 19 మధ్యాహ్నం వరకు వ్రాతలకూ, ప్రయాణానికీ, నూతన వస్తువిక్రయానికీ బాగాయుంటుంది. ఆప్తులను కలుస్తారు. చిరునవ్వులతో ముచ్చట్లు వడుతవి. శుభకార్యాల్లో నిర్ణయానికి రాకలుగుతారు. తర్వాత 23 సాయంత్రం వరకు వ్యాపార పరిస్థితులు ఎగుడుదిగుడుగా యుంటవి. అప్తుల ఆశాభంగం కలిగించెదరు. వారాంతంలో సంఘవ్యవహారాలు సంతోషం కలిగించకలవు. 19 శుభవార్త.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో 21 సాయంత్రం వరకు మీ వృత్తి ఉద్యమ పరిస్థితులు మిగుల అనుకూలంగా యుంటవి. ముఖ్య కార్యక్రమం కూడా త్వరపడి అంతలోపుగా ముగించండి. ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. 18, 19 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం. 19, 20, 21 ల్లో ప్రయాణం, ఇతరులను కలవడం, శుభకార్య ప్రస్తావనలూ అనుకూలం కాగలవు 22-23 ల్లో ఏపనీ నూతనంగా అరంభించవద్దు. 24 స్వల్ప ఆరోగ్యభంగం. ఇరుగుపొరుగుతో వాదం.

**కర్కాటకం** (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)

ఈ వారంలో మీ పరిస్థితుల్లో కొంత మేలు అగపడుతుంది. ఎండలో తిరిగిన వానికి నీడవలె ఈ మేలు ఎంతో హాయి కలిగించకలదు. కాని ఇది సత్యానికీ ధర్మానికీ కాలంకాదు అనిమాత్రం గమనించి తొలగిపోతూ ఉండండి. 18, 19 ల్లో ఆరోగ్యం కొంత సర్దుకుంటారు. కుటుంబ ఆర్థిక పరిస్థితులుకూడా కొంత ఆశాజనకంగా యుంటవి. 20, 21 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం. 22, 23 ల్లో ప్రయాణం అప్తులను కలవడం జరుగుతుంది.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ఈ వారంలో పరిస్థితులు కొంత ఎగుడుదిగుడుగా యుంటవి. ఆర్థిక కుటుంబ చిక్కులు వదిలినట్లే అగపడుతవికాని వదలవు. 18, 19 ల్లో ప్రయాణానికి ఆటంకాలు కలుగుతవి. 20, 21 ల్లో అప్తులనుగురించి ఆతురత కలుగుతుంది. 22, 23 పరిష్కారాలకూ-వ్రాతలకూ-నూతన యత్నానికీ 24 ప్రయాణానికీ మేలు. శని గురువుల ప్రీతికి జపం చేసికొనడం మంచిది. 22 శుభవార్త.

**కన్య** (ఉత్తర 2 3 4 పాదాలు, హస్త చిత్త 1-2 పాదాలు)

అనువుకానిచోట అధికుల మనరాదు అనే ఉక్తి మీరు మరువవద్దు అన్నివైపులా గమనించిపొండి. ఇంతవరకూ ఎదురు లేకుండా జరుపుకున్నారు. ఈవారంలో 19 మధ్యాహ్నంవరకూ 24 వ తేదీ పరిష్కారలకూ-వ్రాతలకూ బాగాయుంటుంది. సంఘ వ్యవహారాల్లో జోక్యం తగ్గించుకొనడంమంచిది. 20 21ల్లో ప్రయాణం ఆగుతుంది. శ్రమఎక్కువ. 22, 23 ల్లో ఆరోగ్యభంగం, ఆశాభంగం జాస్తి. స్వేచ్ఛాలేపన్ మరచిపొండి.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో మొత్తంమీద మీకు విశ్రాంతి యుండదు. ఆరోగ్యంకూడా కొంత తగ్గుతుంది. వాగ్దానాలు చేసినవారు వాయిదాలు వేసి విసిగిస్తారు. 18, 19 ల్లో వృత్తి ఉద్యమాల్లో విసుగు ఎక్కువ. 20 21 ల్లో వ్రాతలూ-పరిష్కారాలూ-నూతన వస్తు విక్రయం లాభకరం. వృత్తిఉద్యమాల్లో ముఖ్యకార్యక్రమం చాలా ఆగుతుంది. షేరు వ్యాపారస్థులు అత్యంత జాగ్రత్త వహించడం మంచిది. 20 శుభవార్త.

**వృశ్చికం** (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ఈ వారంలో 18, 19 ప్రయాణానికీ కార్యావసరంపై ఇతరులనుకలసి సంప్రదించడానికీ మేలు. 20, 21 ల్లో కుటుంబ ఆర్థిక పరిస్థితులు ఎటూ మెదలనీయవు. కోరగాని ఖర్చులు ఎక్కువ. ఆరోగ్యం కూడా తృప్తికరంగా యుండదు. 22, 23 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ ముగించండి. వారాంతంలో శ్రమ ఎక్కువ. వేళకు భోజనం-నిద్రా అమరవు 23 శుభవార్త.

**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)

ఈ వారంలో మీరు ముఖ్యంగా బిడ్డల ఆరోగ్యాన్ని గురించి శ్రద్ధ వహించవలసి యుంటుంది. ఇరుగు పొరుగువల్ల ఆగ్రహానికి గురి కావలసిన పరిస్థితులు కూడా కలుగుతవి. లక్ష్యం చేయనందువల్ల మేలు కలుగుతుంది 18, 19 ల్లో కండ్లు మంటతో బాధపడెదరు 20 21 ల్లో ప్రయాణం శ్రమతో జరుగుతుంది. 22, 23 ల్లో ఇరుగు పొరుగుతో కలహాలు కలుగుతవి. 24 పరిష్కారాలకూ వ్రాతలకూ మేలు.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు, శ్రవణం; ధనిష్ఠ 1, 2 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు గతవారంలో కన్నా మేలుగా యుంటే సూచనలున్నవి. 18, 19 ల్లో ప్రయాణం. ఇతరులను కలవడం జరుగుతుంది. ఉద్యోగ నౌకరీల్లో మార్పులు లాభకరం కాగలవు. 20, 21 ల్లో కోరగాని ఖర్చులు ఎక్కువ. అజాగ్రత్తవల్ల డబ్బు వృధా చేసికుంటారు. 22, 23 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం. ఆప్తులను కలుస్తారు. 23 శుభవార్త. 24 అతృప్తి.

**కుంభం** (ధనిష్ఠ 3,4పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈవారంలో 18, 19, 24 ల్లో ప్రయాణప్రయత్నం సఫలం అవుతుంది. ఆప్తులనూ బంధువులనూ కలుస్తారు. 20, 21 ల్లో పరిష్కారాలూ, వ్రాతలూ పెట్టుబడులూ లాభకరం. 22, 23 ల్లో ఆరోగ్యం తిన్నగా యుండదు. స్పెక్యులేషన్ వద్దు. మొత్తంమీద పరిస్థితులు గత వారంలోకన్నా మేలుగా యుండగలవు. 19 శుభవార్త.

**మీనం** (పూర్వాభాద్ర 4,పాదం. ఉత్తరాభాద్ర, రేవతి)

ఈవారంలో 18 ఓర్పు అవసరం. మీ లోపాలను మీ ఎదుట చెప్పవారుంటారు, వారిపై మీకు ఆగ్రహం కలుగవచ్చు. 19, 20, 21 ల్లో ప్రయాణం విజయంగా ముగుస్తుంది. అలాగే 22, 23 ల్లో పరిష్కారాలూ, పెట్టుబడులూ, స్పెక్యులేషన్ లాభకరంగాగలవు. 24 ఆరోగ్యం సరిగా యుండదు. ప్రయాణం ఆపండి. 21 శుభవార్త. 22 అస్తసమాగమం.

## తిరుపతి పురపాలక సంఘాధ్యక్షునిపై విశ్వాసరాహిత్య తీర్మానం

తిరుపతి, డిసెంబరు 16: తిరుపతిపురపాలక సంఘ సమావేశం నేడు చంద్రగిరి అసిస్టెంటు కలెక్టరు కె. శివసుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతను జరిగినప్పుడు, పురపాలక సంఘ అధ్యక్షులైన సి. ఎస్. రామయ్యగారిపై విశ్వాసరాహిత్య తీర్మానం చేయబడెను. తీర్మానానికి అనుకూలంగా 12 మంది, వ్యతిరేకంగా ముగ్గురు సభ్యులు ఓటు చేశారు పురపాలకసంఘసమావేశానికి అధ్యక్షత వహించే అధికారం రెవెన్యూ డివిజనల్ ఆఫీసరుకే గాని అసిస్టెంటు కలెక్టరుకు లేదని రామయ్య గారు ఆక్షేపణ తెలియజేయ్యగా, సమావేశాధ్యక్షులు దానిని త్రోసివేశారు స్వ. వి.

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 19 సోమవారం

### మద్రాసు (ఎ)

ఉ. 7-30 టి ఎస్. కోకిల, పాట. 8-0 ఇంగ్లీషున వార్తలు 8-15 సినిమా సంగీతం (రి) 8-30 హిందీపాఠము, 8-50 మద్రాసు (బి) వలె మ. 1-30 ఇంగ్లీషున వార్తలు. 1-40 సినిమాసంగీతం (రి) 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు. ఇంగ్లీషున 4-30 పాశ్చాత్య సంగీతం (రి) సా. 5-30 ఎం. ఎస్. అనూరాధ పాట. 6-0 ఇంగ్లీషున వార్తలు 6-20 ఎ సుబ్బన్న కుమారస్వామి వీణ 7-30 గీతమంజరి (రి) 7-45 జంత్రి సమ్మేళనము 8-30 సేలం డి. చెల్లమయ్యంగార్ పాట. 9-0 ఇంగ్లీషున వార్తలు 9-15 మద్రాసు (బి) వలె 10-0 సినిమా సంగీతం. (రి).

### మద్రాసు (బి)

ఉ. 7-0 తెలుగున వార్తలు. 7-15 జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం (రి) 7-45 మద్రాస్ (ఎ) వలె 8-30 హిందీపాఠము. 8-50 టి. ఎస్. వీరరాఘవన్ టి. ఎస్. వేదాంతం. మ. 12-0 కార్మికుల కార్యక్రమం. 12-30 తెలుగుసాహిత్యము భక్త చింతామణి కథకము. ప్రసంగం బృందగానము సెయింట్‌రాఫెల్ బాలికోన్నత పాఠశాల 1-30 మద్రాసు (ఎ) వలె 1-50 తెలుగున వార్తలు. 2-15 మద్రాసు (ఎ) వలె. 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు రసాయన శాస్త్రము అర్థకము ప్రసంగం. సి. ఆర్. విశ్వనాథం గద్యకథ దీపికము వ్యాయామ పాఠాలు నిర్వహణ సి. కళ్యాణనందం. సా 5-30 మద్రాసు (ఎ) వలె 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయ దారనికి సలహాలు ఆకు కూరల పెంపకము ప్రసంగం. 7 తెలుగున వార్తలు 7-15 ప్రపంచ మానవ జాతులు ఆస్ట్రేలియన్ జాతివారు. ప్రసంగం 8 టి. వి. రత్నం పాట 8-30 మద్రాసు (ఎ) వలె 9-15 దేవయ్య సంసారం రూపకము రచన రుక్మిణీనాథ శాస్త్రి 9-30 వి. ముత్తుస్వామి అయ్యర్ వయొలిన్. 10 మద్రాసు (ఎ) వలె.

### విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు 7-15 అనంత లక్ష్మి కీతగోపన్ కీర్తనలు. 7-30 టి. లక్ష్మీనారాయణ శాస్త్రి వీణ 8 ఇంగ్లీషున వార్తలు 8-15 హిందీ నేర్పటం. మద్రాసు విద్యా మంత్రి మాధవమీనన్ ఇంగ్లీషు ప్రసంగం. 8-30 హిందీ పాఠము 8-50 డి. శ్యామల డి. సరోజ పాట మ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1 తారాపథం (రి) 1-30 ఇంగ్లీషున వార్తలు 1-50 తెలుగున వార్తలు 2.15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా 5-30 లక్ష్మీనారాయణశాస్త్రి వీణ, 6 ఇంగ్లీషున వార్తలు. 6-20 గీతావళి. కవుల నరసింహారావు 6-30 గ్రామస్థుల కార్యక్రమం. (మద్రాసునుండి) 7 తెలుగున వార్తలు 7-30 చర్చనీయాంశం, 7-30 ప్రభుత్వ నిర్ణీత విద్యావిధానం అవసరమా? పాల్గొనువారు పెద్దాడ రామస్వామి. విస్సా అప్పారావు. 8 పేరి సుబ్బారావు వయొలిన్. 8-30 డి. శ్యామల డి. సరోజిని పాట. 9 ఇంగ్లీషునవార్తలు. 9-15 మన ఆహార సమస్య. పి. వీరయ్యచౌదరి. ఇంగ్లీషు ప్రసంగం. 8-30 పేరి సుబ్బారావు వయొలిన్.

## అమ్మకము

వెంటనే డెలివరీకి, 8/9,/10/11,/18/14 హెచ్. పి. కూపర్ ఆయిల్ యింజన్లు, 6/10, 16/20 యానార్ యింజన్లు, 31 హెచ్. పి క్రాస్లీ & 8 హెచ్. ఆర్. 6 X హెచ్. ఆర్. రస్టన్ యింజన్లు దొరకును.

వివరములకు:

**సూర్య ట్రేడింగ్ కంపెనీ,**
20 లింగిచెట్టివీధి, మదరాసు 1.

## టెండరు

నాన్-గెజిటెడ్ గవర్నమెంటు ఆఫీసర్స్ ఎసోసియేషన్,
యేలూరు, పవర్‌పేట.
(హేలాపురి సంస్కృత పాఠశాలవద్ద)

పై సంఘమువారి భవనము కట్టుటకు టెండర్లు కోరబడుచున్నవి. యెస్టిమేటు మొత్తము రు 10,000/-లు ప్లాను సంఘము ఆఫీసులో చూడవచ్చును. పూర్తివివరములు, పై సంఘమువారికి వ్రాసి తెలుసుకొనవచ్చును. టెండర్లు మాఆఫీసుకు 31-12-49 తేది లోగా చేరవలయును. టెండరు డిపాజిట్టు రు 100/-లు చెల్లించవలయును. సదరు మొత్తమును పై సంఘమువారిపేర, యేలూరు కో. ఆపరేటివు అర్బన్ బ్యాంకులో చెల్లించి, రసీదును తోసహా టెండరు ఫారము పంపగోరుచున్నాము. లేనియెడల టెండర్లు అంగీకరింపబడవు.

ఏలూరు (సం) అ. తా. సూర్యరావు,
15-12-49 సెక్రటరీ.

ఆంధ్రపత్రిక

ఆదివారం డిసెంబరు 18, 1949

సారస్వతానుబంధము

# భారత జాతీయ నౌకా దినమహోత్సవం



.భారతజాతీయ నౌకాశాఖకు చెందిన "హెచ్. యం. ఐ. యస్. రాజపుటానా" ఇది 11 వ డెస్ట్రాయర్ దళంలోని నాయక నౌక

## యుద్ధనౌకా నిర్మాణంలో శాస్త్రపరిజ్ఞానం

**కమోడోర్ ఎచ్. డ్రూ, రాయల్ భారత నౌకా శాఖ ప్రధానాధికారి**

మానవుడు పరిమితం లేని ప్రాణి. అతడికి కదలికా, మార్పూ కావాలి. అందుకనే మానవుడు నేలమీదా, తరువాత నీటిమీదా, చాలా తరువాతగా గాలిలోనూ వాహనాలను నడపడం జరిగింది.

కొత్తలో, మానవుడు దుంగల మీద కూర్చుండి నీటిపై ప్రయాణించాడు. తరువాత, వాటిని తొలిచి అందులో సరుకులనూ, తన భార్యనూ కూడా ఎక్కించాడు మానవుడు. తెడ్లూ, తెరచాపలూ క్రమంగా వచ్చాయి. క్రమంగా పడవల ఆకారానికీ, తూకానికీ సంబంధించిన సమస్యలు కూడా ఏర్పడ్డాయి. నౌకానిర్మాణమూ, దానితో బాటు మారణాస్త్రాలూ పరిణతి చెందాయి.

ఆరంభదశలో ఉత్పన్నమయిన సమస్యలను ఒంటరిగానే తమ అనుభవంతో ఎదుర్కొనే వారు. రానురాను అనేకమంది కలసి తమ జ్ఞానాన్నీ, శక్తులనూ కేంద్రీకరించవలసివచ్చింది. అప్పటికీ విజ్ఞానం కంటె అనుభవమే ఎక్కువగా ఉపయోగపడేది.

రానురాను కొందరు నిపుణు లేర్పడ్డారు. వీరు సంపాదించిన విజ్ఞానం విద్యగా లభించసాగింది. మరికొంత కాలానికి శాస్త్రవేత్తలు బయలుదేరారు. పూర్వం వారికన్న శాస్త్రవేత్తలు అధికంగా చేయగల దేమంటే తమకున్న జ్ఞానం సహాయంతో కొత్త జ్ఞానం సంపాదించగలరు. ఇప్పుడు నావికుడూ, నౌకాశాస్త్రజ్ఞుడూ వేరు వ్యక్తులైపోయినారు. నావికుల వివిధ సమస్యలను గురించి పరిజ్ఞానంగల శాస్త్రవేత్తలు అనేకమంది వివిధ విషయాలలో కృషిచేస్తారు, అన్వేషణలు సాగిస్తారు. ఇంకొకటేమంటే ఒక్కొక్క విషయమే అనేక విభాగాల కింద చీలిపోతున్నది. ఒక్కొక్క విభాగాన్ని గురించీ పరిజ్ఞానం సంపాదించడానికి ఒక్కొక్క మనిషి ప్రత్యేకంగా ఉండాలి. ఈనాటి యుద్ధనౌకను నిర్మించడానికి అనేకమంది నిపుణులు అనేక విషయాలను గురించి పూర్ణపరిజ్ఞానం కలవారై ఉండాలి. వీరందరి కృషినీ సమీకరించి, సమన్వయించడానికి బ్రహ్మాండమైన వ్యవస్థాపన అవసరం.

కనుకనే ఇటువంటి వ్యవస్థాపనను ఇండియా ప్రభుత్వం పూనుకొన్నది. మరికొన్ని ఇతర దేశాలకన్న మనదేశం ముందడుగు వేసి సైనిక, నౌకా, విమానశాఖలను సంబంధించిన శాస్త్రపరిశోధనా యావత్తూ సమష్టిగా జరగడం కోసరం రక్షణ శాఖా నిర్వహణ కింద రక్షణ శాస్త్రపరిశోధనా సంస్థ నెలకొల్పబడుతున్నది. ఈ మూడు శాఖలకూ ప్రత్యేక సమస్యలున్నప్పటికీ అనేక సమష్టి సమస్యలు కూడా ఉన్నవి.

నిత్యకృత్యాలలోనూ, అవసర పరిస్థితులలోనూ కూడా నావికులకూ శాస్త్రవేత్తలకూ సంపర్కా లుండాలి. యుద్ధకాలంలో అవసర పరిస్థితులు హెచ్చుగా ఉంటాయి. గొప్ప మార్పులు జరిగించవలసిన అవసరమూ, జరిగించడానికి తగిన ద్రవ్యమూ యుద్ధకాలంలో హెచ్చుగా లభిస్తాయి. ఈ శతాబ్దారంభంలో నౌకలమీద ఫిరంగులకు సంబంధించిన కొన్ని సమస్యలను పరిష్కరించడానికి "హ్వేల్ ఐలండు మీదా, అడ్మిరాల్టీవారి రిసెర్చి లాబొరేటరీలలోనూ అనేకమైన పరిశోధనలు జరిగి సమస్యలు పరిష్కారమైనాయి. ఇటువంటి నిదర్శనాలెన్నయినా ఉన్నాయి. ప్రతిరోజూ, ఏడాది పొడుగునా, నావికులకూ శాస్త్రవేత్తలకూ మధ్య సహకారం సాగుతూనే ఉన్నదని భావించవచ్చు.

అవసర పరిస్థితి మంచి ఉదాహరణగా మాగ్నెటిక్ మైనులను తీసుకోవచ్చును. ఇవి గత యుద్ధారంభంలో ఆకస్మికంగా నాపురించాయి. రోటర్‌డాము సమీపంలో ఒక పెద్ద ప్రయాణీకుల నౌక మాగ్నెటిక్ మైను మీదుగా వెళ్లింది. ఆనౌకను పేల్చినది ఏమైనదీ తెలియరాలేదు. మైనులను పరిశోధించే యంత్రాలేమీ కనుక్కొనలేకపోయాయి. ఈ మాగ్నెటిక్ మైన్ సంగతి తెలిసిన తరవాత శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసి వాటిని నాశనం చేసే మార్గాలు కనిపెట్టగలిగారు.

నౌకా నిర్మాణంలో మానవుడు ప్రకృతిని అనుకరించాడు. నీటి అడుగున ఉండే నౌకల పొట్టలు జలనిరోధాన్ని సాధ్యమైనంత తగ్గించేటందుకు చేపపొట్టలవలె తయారు చేయబడతాయి. కొత్త ఆకారాలు గల నౌకలను తయారు చేయాలంటే అనేక పరిశోధనలు జరిపి జలనిరోధం హెచ్చకుండా చూడవలసి ఉంటుంది. అవిశ్రాంతంగానే తయారైన నౌక ఇంత వేగంతో పోవాలంటే ఎంత శక్తివంతమైన ఇంజనులు కావాలనే సమస్య వస్తుంది. ఆశక్తికీ నౌక బరువుకూ సమన్వయం ఉండాలి. ఇంజన్ల కింద ప్రత్యేకించే జాగా, వాటిలో ఉపయోగించే బొగ్గు వగైరాలను నిలువచేసే మార్గాలూ, యుద్ధనౌకలలో ఈ దహ్యక పదార్థాలను సంరక్షించే మార్గాలూ, ఇంధనాలకొరకు రేవు చేరకుండా నౌక వెళ్లగల దూరమూ మొదలైన వాటిని గురించి పరిశోధనలు జరగవలసి ఉంటుంది.

తరువాత యుద్ధంలో దెబ్బా, కాపూ ఉంటాయి. యుద్ధనావలు దెబ్బతీసేటప్పుడు దూరాన ఉన్న శత్రువును తెలుసుకోగల గాలి, దూరంనుంచే దెబ్బతీయగల గాలి. అనేక మైళ్ల దూరం పేల్చగల ఫిరంగులూ, రాడారూ ఇందుకుచాలా ఉపయోగిస్తున్నాయి. అదేవిధంగా రక్షణగాను నౌకలకు బలమైన కవచమూ, రాడారుకు పనిచేయకుండా చేసే సాధనాలూ ఉన్నవి. అనేక ఏళ్ల పరిశోధనల ఫలితంగా ఇవి కనిపెట్టబడ్డవి.

నౌకలమీద ఫిరంగు లుంచగానే సరికాదు. వాటిని కదల్చడం ఒక సమస్య. శత్రు నౌకలు కదులుతూ ఉంటాయి. ఫిరంగి గుండు వాటిని తాకడానికి వ్యవధి పడుతుంది. వీటన్నిటినీ అంచనావేసి తీసుకొని ఫిరంగులను తిప్పాలి. దీని విషయం ఎంతో శాస్త్రపరిశోధన జరిగింది.

ఇంకా ఆహారం చెడకుండా దాచడం, నౌకలను వాసయోగ్యంగా చేయడం, కుదుపులేకుండా చేయడం, నావికుల ఆరోగ్యం మొదలైన అసంఖ్యాక సమస్యలున్నాయి.

ఈ సమస్యలను పరిష్కరించే శాస్త్రజ్ఞుడికీ సమస్యయొక్క యథార్థ స్వరూపం నిస్పష్టంగా తెలియాలంటే పరిజ్ఞానం గల నావికాధికారులుండాలి. కనుకనే నేటి నావికాధికారులు విద్యాధికులూ, శాస్త్రపరిజ్ఞాతలూ అయి ఉంటున్నారు.



భారత నౌకాదళంలోని సప్లయ్‌శాఖ డైరెక్టర్ కాప్టెన్ కె. యల్. కె. రావు

> ఎన్నో శతాబ్దాలనాడు అంతరించిన నౌకాసంపదను పునరుద్ధరించుకొని స్వతంత్రభారతి డిసెంబరు 17 వ తేదీన ప్రథమ దఫా భారతజాతీయ నౌకాదిన మహోత్సవం జరుపుకుంటున్నది.

## నౌకాదళంలో విద్యాబోధన

**శిక్షణ శాఖా కాప్టెన్ డబ్ల్యు. ఐ. శాక్స్టన్**

విద్యాబోధనమంటే సాధారణంగా అందరికీ తట్టేవి లెక్కలు, చరిత్ర, వ్యాకరణం మొదలైనవి. కాని మనుష్యుడి శారీరక, బుద్ధి సంపదలు పెంపొంది, ప్రత్యేక వ్యక్తిత్వాన్ని వృద్ధిచేయటమే విద్య అన్నదానికి అర్థం. సమాజంలో ఉత్తమసభ్యుడుగా వ్యక్తిని విద్య తయారుచేస్తుంది. దీనిని సాధించటంలో భారత నౌకాదళం చాలావరకు ముందుకు వెళ్ళిందని చెప్పవచ్చును.

చిన్నతనంలోనే పట్టుకుని విద్యనేర్పటం అవసరమని నౌకాదళం విశ్వసిస్తుంది. 15, 16 ఏళ్ళ వయస్సు కొత్తవి నేర్చుకోటానికీ, కొత్త జీవితానికీ అలవాటు పడటానికీ ఎంతో అనువైనది. నౌకాదళంలో ఎన్నో నేర్చుకోవాలి కనుక సాధారణ విద్య కొంతవరకూ బాగా వచ్చినవారినే ఆ వయసువాళ్ళలో ఎన్నుకుంటారు.

నౌకలమీద ఎన్నోరకాల పనులుండటంవల్ల ఒక్కొక్కరు ఒక్కొక్కదాంట్లో ప్రత్యేక కృషిచేయాలి, ఓడ ఉన్న స్థలనిర్ణయం చేయగల నావిగేటర్లు, ఫిరంగి నిపుణులు, వైర్లెస్ ఆపరేటర్లు, వంటవాళ్లు, ఇంజనీర్లు, ఎలక్ట్రిషియన్లు, గుమాస్తాలు ఎన్నోరకాలవాళ్లు ప్రత్యేక శిక్షణపొందాలి. మంచితిండి, వ్యాయామం, డ్రిల్లు, ఆటలు మంచిశరీరాలను పెంపొందిస్తే, ఇంగ్లీషు, లెక్కలు, సైన్సు, భూగోళశాస్త్రం, దేశవ్యవహారాలు మొదలైనవాటి బోధన బుద్ధిని తయారుచేస్తుంది.

అన్నిరకాలవాళ్ళకూ నేలమీదనే 15 నెలలపాటు కలిపి శిక్షణనిచ్చి, ఆతరవాత ఏశాఖవాళ్ళను దానికి పంపుతారు. ఆర్టిఫైసర్లు—అంటే ఎంతో ఉత్తమమైన ఇంజనీర్లన్నమాట—4 ఏళ్లు శిక్షణ పొందాలి.

నేలమీద ఇచ్చు శిక్షణలో నౌకలో ఉండే పరిస్థితులకు విద్యార్థులు అలవాటు అవుతారు. ఎంతపెద్ద నౌకలోనైనా ఒకరితో సంబంధంలేకుండా ఎవ్వరూ ఉండలేరు.

ఒకటి రెండేళ్లు శిక్షణ అయిన తరవాత 'ఏబుల్ సీమన్'గానో దాని సమానమైన ఇతర హోదాలో పంపబడతాడు. కాని శిక్షణ అంతటితో పూర్తికాదు, పైకిరాదలుచుకున్నవాళ్లు మెళుకువ, శ్రద్ధా చూపించవలసింది ఇప్పుడే.

నౌక అంటే అన్నివిధాలా స్వయంపోషకమైనదన్నమాట. ప్రతి నౌకలోనూ ఒక ఉపాధ్యాయుడుండి, పరీక్షలకు వెళ్ళేవాళ్ళకూ, ఊరికనే చదవదలచిన

(12-వ పేజి చూడుడు)



భారత నౌకా సర్వసేనాని వైస్ అడ్మిరల్ డబ్లియు. ఇ. పారీ

## యుద్ధనౌక అంటే ఏమిటి?

భారతదేశంలో సాధారణ ప్రజలకు నౌక అంటే ఏదో ఉక్కుతో చేయబడ్డ వస్తువనీ, నీళ్లమీద తేలుతూ తిరుగుతుందనీ అన్నది తప్ప వేరే తెలియదు. నాకు టుకు నేనుకూడా నౌకా శిక్షణ కోసం 'డఫరిన్'లో చేరేవరకూ సముద్రాన్నే చూడలేదు. నౌకాదళంలో చేరిన చాలామంది భారతీయుల సంగతికూడా ఇంతే.

భారత నౌకాదళంలో కల్లా పెద్దనౌక పరిమాణం 7 వేల టన్నులేనని తెలిసినప్పుడు చాలామంది ఆశ్చర్యపడతారు. 'బొంబాయికివచ్చే ప్రయాణ నౌకలే 20 వేల టన్నులవరకే ఉన్నవే - మన పెద్ద నౌక అంత చిన్నదా? "అని అడుగుతారు. దీనికి కారణం వారికి యుద్ధనౌకనుగురించి వివరాలు తెలియకపోవటమే.

యుద్ధనౌక ప్రయాణీకులకుకానీ, సరుకులనుకానీ తీసికెళ్లదు. దానిమీద ఉన్న

**కాప్టెన్ ఆర్. డి. కటారి**

ప్రతివ్యక్తికీ, ఒక నిర్ణీతకర్తవ్యం ఉన్నది.

సరుకుల నౌకలకూ, ప్రయాణ నౌకలకూ వీలయినంతచోటూ, వీలయినన్ని సౌకర్యాలూ సమకూర్చటమే ముఖ్యోద్దేశం. కాని యుద్ధనౌకల నిర్మాణ విషయంలో—అది బ్రహ్మాండమైన బ్యాటిల్ షిప్ కానీయండి, అతి చిన్న ఫ్రిగేట్ కానీయండి—వాటికి కావలసినది వీలయినంతవేగము, అతిచులకనగా ఎటుపడితే అటు తిరగగలగటము. ఆతరవాత ఫిరంగిణించేది ఎన్ని ఎక్కువ ఆయుధాలను తీసుకువెళ్ళగలిగేశక్తి. వీటికి బలిష్ఠమైన ఇంజన్లు కావాలి.

నీటిమీదఉన్న శత్రువులను కొట్టటా

(12-వ పేజి చూడుడు)



నౌకా సైనికుల ప్రధానాధికారి కాప్టెన్ ఆర్. డి. కటారి



11 డెస్ట్రాయర్ దళం నౌకాసేనాని కాప్టెన్ ఎ. చక్రవర్తి



హెచ్. యం. ఐ. యస్. రాణా—11 వ డెస్ట్రాయర్ దళం



11 వ డెస్ట్రాయర్ దళంలోని నౌక హెచ్. యం. ఐ. యస్. రంజిత్




# కర్మఫలము

**శ్రీ కంచి వాసుదేవరావు**

రామన్నగారు రిక్షా ఎక్కినప్పటినుంచీ అనుకుంటున్నారు. యీ రిక్షావాలాని ఎక్కడో చూశానని. కానీ ఎక్కడ చూసారో ఎప్పుడు చూసారో ఎంత సుర్తుకు తెచ్చుకుందామని ప్రయత్నించినా సుర్తుకురావడములేదు. పోనీ తను ఎవో భ్రమపడుతున్నారని అనుకుందామా అంటే ఆ రిక్షావాలాకూడా తనవంక అల్లాగే నాలుగయిదుసార్లు చూసాడు. తనకీ పట్నములో ఎరుగున్నవాళ్లు ముఖ్యముగా యీ గ్రామజీవులలో ఎవరూ లేరు. మరి ఎవరన్నదే తెలియములేదు. చివరకి రిక్షావాలాయే "బాబూ యీవూళ్లోనే వుంటున్నారా?" అని అడిగాడు. "అవును నాలుగునెలల క్రితమే యిక్కడికి బదిలీ అయింది. అయితే నువ్వు నన్నెరుగుదువా?" "ఎరుగున్నాను బాబూ. మీరు మమ్మల్నిక్కే మరచిపోతారుకాని మేము మిమ్మల్ని మరచిపోతేము. మీరు బందరులో వకీలు సుందరరామశాస్త్రిగారింటి యెదురుగా వుండేవారు. నేను వారింట్లో పనిచేసే నౌకరు వెంకడ్ని" అంటూ మరచిపోయిన పాతకథను సుర్తుకు తెచ్చాడు.

ఆ ఎప్పటిమాట యిది తను దాదాపు పది యేళ్లక్రితము బందరు కలక్టరు ఆఫీసులో పనిచేస్తున్నప్పటిమాట. అప్పుడు తను కుటుంబము వకీలుగారి కుటుంబము ఎంతో తల్లీ తోడుగావుండేవి. తర్వాత తను సంటూరు కాకినాడ తిరిగి చివరికి యీవూరికి నాలుగునెలల క్రితము వచ్చారు. వకీలుగారి నౌకరు యిక్కడ ఆపని మాని వేసి రిక్షా లాగుతున్నాడంటే రామన్నగారికి ఎంతో ఆశ్చర్యం వేసింది. వెంకడ్ని వాళ్లు తమ కన్నకొడుకులా చూసుకునేవాళ్లు. మాటల సందర్భాన వెంకడివంటి విశ్వాసపాత్రుడయిన నౌకరు మరి లేడని అంటూండేవాళ్లు. వెంకడుకూడా వాళ్లని అల్లాగే చూసేవాడు. మరి అట్టాంటి పరిస్థితులలో వెంకడు యిక్కడ యీవిధముగా జీవితాన్ని గడుపుతున్నాడంటే ఆశ్చర్యము వేసింది దానికి ఏదైనా కారణముంటే తెలుసుకోవాలని కుతూహలము కల్గింది. వెంకడ్ని ఎందుకు మానేసావు? అని అడిగితే "ఎందుకుబాబూ మళ్లా ఆకథంతా" అంటూ చెట్టుచేసాడు. దానితో అసలు సంగతి తెల్సుకోవాలని మరింత కుతూహలముతో యింటికి చేరగానే భోజనము పెట్టించి సంగతి అంతా చెప్పమని అడిగితే వెంకడు తనకథను చెప్పడము మొదలెట్టాడు.

"బాబూ నా ఎనిమిదోయేటనుంచివారు నన్ను చేరదీసి తిండీగుడ్డాయిచ్చి కన్నకొడుకులా పెంచి పెద్దచేసారు. నేను కూడా కూటికిలేక బాధపడ్డుంటే కూడూ గుడ్డాయిచ్చారన్న విశ్వాసము మరచిపోక వారి పాదాలనంటి పెట్టుకుని వారినే దైవముగా భావించి పనిచేసాను. నా పెళ్లికి బాబూగారు స్వయముగా వంద రూపాయలిచ్చి నా యిష్టమునచ్చినట్టు ఖర్చు పెట్టుకోమన్నారు. అమ్మగారు నా పెళ్లాము సుబ్బికి పసుపు కుంకముచీరపెట్టారు. ఎన్నడు చూడని వందరూపాయలు కంటపడేటప్పటికి విపరీతమయిన సంతోషము దానితో పాటు వారి పైభక్తి ఎక్కువయ్యాయి"

అవునులే అదంతా నాకు తెలుసుగా నువ్వెందుకు మానేసావో చెప్పు "అని అడ్డు తగిలాడు రామన్నగారు."

"అల్లాగే బాబూ నే నాలాగ పాతికేళ్లు పనిచేసాను. యింకా ఎన్నాళ్లుచేసావాడినో కానీ..."

రామన్నగారి కూతురు ఏడ్చుకుంటూ "నాన్నా అమ్మకొట్టింది" అంటూ వచ్చింది.

"ఎందుకుకొట్టిందమ్మా?" అని బుజ్జగిస్తూ రామన్నగారు అడిగారు.

"గోపి అద్దాన్ని బద్దలుకొట్టి అమ్మ వచ్చేలోపల పారిపోయాడు. అమ్మ నేనే బద్దలుకొట్టానని నన్ను కొట్టింది" అంటూ యింకా ఏడుస్తూ చెప్పింది.

"వాడురానీ అమ్మా వాణ్ని నేను చితకబాదుతా తంతానులే. అమ్మనికూడ కోప్పడతాలే. యిల్లా కూర్చో అమ్మా" అని తనపక్క కూర్చోపెట్టుకుని "సరే నీకథకానీవోయి" అని వెంకడితో అన్నారు.

"ఒకరోజు సాయంత్రము జరిగినసాయంత్రమే నా జీవితాన్ని నాశనముచేసింది. నా పై బాబుగారికి పగనిపుట్టించింది...ఆరోజు సాయంత్రము యింట్లో నేనూ అమ్మగారు తప్ప ఎవరూ లేరు." వెంకా నేను లేలంటున్నా ముచేసివస్తా... అందాక యిల్లో నే కనిపెట్టుకుని వుండు "ఇట్టా అమ్మగారు నాతో చెప్పి స్నానానికి వెళ్లిపోయారు. అమ్మగారు లోపలికి వెళ్లిన అయిదు నిమిషాలకే సుందరమ్మగారు వచ్చారు."

"ఎవరు ఆవిడ?"

"అవిడే పరాబుగారిభార్య...రాత్రిని...నావుసుగు అవిడకి తెగలకపోతుందా?"

"అవును అవిడపేరు తెలియదు నాకు ...అవిడనిన్నెంచేసిందేమిటి?"

"యింకేంచేయాలి బాబూ...నన్ను నాశనముచేసింది. నాకు బాబూగారికి ఎడబాటు కలుగజేసింది..."

"ఆ...నీ కధకానీ..." అట్టింపు కుతూహలముతో రామన్నగారు.

"అమ్మగారు స్నానానికి వెళ్లిన అయిదు నిమిషాలకే యీవిడ వచ్చింది. యీ విడ బాబుగారింట్లో ఎక్కడికి పడితే అక్కడికి వెళ్ళేచనువుంది. 'అమ్మగారు తలంటిపోసుకోవడానికి వెళ్ళారు, కూర్చోండి అన్నా! లోపల అయిదు నిమిషాలయినా కూర్చుందో లేదో ఆవిడ బయటకి వచ్చేసింది. 'ఏం అమ్మా వెళ్ళిపోతున్నారేం?' అని అడిగా, పదండి వెంకా మళ్ళీ వస్తానంటూ ఆవిడ వెళ్లిపోయింది. తర్వాత కొద్దిసేపటికి అమ్మగారు వచ్చారు. 'అమ్మా యిల్లా సుందరమ్మగారు వచ్చి వెళ్లారన్నా' సరేలే వెంకా! నువ్వు బజారుకి వెళ్ళి వీశడు పంచదార తీసుకురా. అంతకంటే యివాళిటి కేంపనిలేదు అని చెప్పారు. నేను డబ్బు తీసుకుని వెళ్లాను, దారిమధ్యలో గారడీ తమాషా చూస్తూ కాసేపు నుంచుని పంచదార తీసుకువచ్చాను. యీ గారడీ చూడ్డమువలన యింటికి దీపాలు పెట్టే వేళ చేరుకున్నాను.

యింటికి వచ్చేటప్పటికి అమ్మగారు ఏదో వెతుకుతున్నారు. "ఏమిటమ్మా వెతుకుతున్నారు." అన్నా. నా చంద్రహారము కన్పించడములేదు. యీబల్లమీద మర్చిపోయాననుకుంటా. మరింకెక్కడ పెట్టి మర్చిపోయానో సుర్తులేదు. "ఎక్కడికి పోతుందమ్మా! ఏపెట్టెలోనో పెట్టి మర్చిపోయి వుంటారని నేనూ వెతకడము మొదలు పెట్టాను. కానీ పోయిన వస్తువు ఎక్కడ కన్పిస్తుంది? వెదికిన పెట్టెలే వెతికాము కానీ కన్పించలేదు. చివరికి పోయిందని నిర్ధారణ చేసుకున్నారు. బాబుగారు వచ్చాక యీ సంగతంతా తెలుసుకొని అమ్మగార్ని అంతమంద మరుపుగా వున్నందుకుబాగా కోప్పడ్డారు. తర్వాత శాంతించి యీ పని ఎవరిదయి వుంటుందా అంటూ తర్జనలు భర్జనలు పడ్డారు నాలుగయిదుసార్లు. "సుందరమ్మగారు తప్ప ఎవరూ రాలేదు కాదూ?" అంటూనన్ను రెట్టించి రెట్టించి అడిగారు. రాలేదనే నేను జవాబు చెప్పాను.

యింటి పనులు ఆలస్య మవుతే నేను బాబుగారింట్లోనే పడుకుంటా. బాబుగారు నన్నా వేళ అక్కడే పడుకోమన్నారు. ఆ వేళ యీగొడవలతో యింటి పనులాలస్యముగా అయ్యాయి. నేను బాబుగారి గదిపక్కనే చాప పరచుకుని పడుకున్నాను. ఒక్క నిద్రపోయాను. యింతలో మెలకువ వచ్చింది. బాబుగారి గదిలోంచి, బాబుగారి అమ్మగారి మాటలు పెల్లిగా అయినా బాగా వినిపిస్తున్నాయి.

'అయితే వెంకడే అంటారా?' అని అమ్మగారి గొంతుక.

గుండె ఆగిపోయినంతపని అయింది. చివరికిది నామీదకే తిరుగుతుందని నే నెరగను. అయినా యింకా ఏ మనుకుంటున్నారో వింటున్నా.

'హష్ వాడు వింటాడు. పక్కనేపడుకున్నాడు జాగ్రత్త. అని బాబుగారి గొంతుక.

'లేదు వాడు నిద్రపోతున్నాడు. అయినా ఓసారి చూసివస్తా' అంటూ బయటకు వచ్చి వెంకా వెంకా అని పిలిచారు. నేను మెలకువగావున్నా నిద్రపోతున్నట్టు నటించి పలుకలేదు. నేను నిద్దరపోతున్నానని నమ్మి అమ్మగారు లోపలికి వెళ్లి

'లేదు వాడు నిద్రపోతున్నాడు...... అయినా వెంకడు తీస్తాడన్నా తీశాడన్నా నాకు నమ్మకములేదు.

'అవును నిజమే. వాడిసంగతి నీకన్నా నాకు ఎక్కువ తెలుసు. వాణ్ని యిదవ అయిదేళ్ళనుంచీ ఎరుగుదును. కానీ ఒక్క పూచికపుల్ల తీయలేదు. కానీ మనిషిలో ఏక్షణానికి ఏదుర్బుద్ధిపుడుతుందో ఎవరు చెప్పగలరు? ఆ చంద్రహారముమీద వాడి కన్ను పడింది. ఒక్కసారిగా వాడిలో ఎప్పుడూ లేని దుర్బుద్ధి పుట్టింది. నువ్వు స్నానానికి వెళ్ళగానే అవకాశము చూసుకుని తీసేసివుంటాడు. బల్లమీద పెట్టావో పెట్టెలో పెట్టావో సుర్తు లేదంటున్నావు. బల్లమీద పెడ్తే చెప్పక్కర్లేదు, పెట్టెలో పెడ్తే తాళము చెవులు ఎక్కడవుంటాయో వాడికి తెలియదనుకున్నా... మరింకకన్నా తీసే వాళ్ళెవరున్నారు? సుందరమ్మగారు తప్ప ఎవరూ రాలేదని వాడే చెబుతున్నాడు. యింకెవరున్నారూ? వెంకడు తప్ప. అందుకని ఎంతనమ్మకానికి పిలుకేసున్నా వాడే అని నిశ్చయించాను. యింకా యిల్లుదాటివుండదు. ఎందుకయినామంచిది అని అందుకనే వాణ్ని యిక్కడ పడుకోమన్నాను........'ఏమిటి అల్లా ఏడుస్తావు?' 'దురదృష్టానికి నేను స్నానము చేసి రాగానే వాణ్ని బజారుకి పంపించాను. రావడము ఆలస్యముగా వచ్చాడు. ......'యింకేం అనుభవించు యిల్లుకూడా దాటిందన్నమాట. అందులో ఆలస్యముగా వచ్చాడంటున్నావా?......కానీ ఏడ్చి ఏంలాభము? వాడికి ఎన్నడూ లేని దుర్బుద్ధి పుట్టింది. రేపు గట్టిగా కేకలేసి వెంటనే యిచ్చెయ్యమంటాను......యిప్పుడు మంచిగా మర్యాదగా యిచ్చేస్తే క్షమించి పనిలో పెట్టుకుంటాను, వాడు చిన్నప్పట్నించి నాదగ్గర పెరగడమువలన వాణ్ని యాగీచేయడము నా కిష్టములేదు మన మంచితనాన్ని గ్రహించాడాసరేసరి. లేకపోతే... నేనెంతపని అయినా చేయడానికి సిద్ధము...

'యిందాక ఎలా వినగలిగానో తెలియదు బాబూ...అమ్మగారు పంపుతే ఆఖరికి బజారుకివెళ్లి పంచదార తేవడము పరదాగా మాలోటివాళ్లకి అవే సక్కసులు కనుక కాసేపు గారడీ చూసి రావడము నాకు ఎదురు తిరుగుతుందని నేను కలలోకూడ అనుకోలేదు బాబూ... ఆ రాత్రి నాకు నిద్రాలేదు శాంతీలేదు. నేనేం చేయునుబాబూ! నేను మంచిగా మర్యాదగా యిచ్చేయాలిట. కానీ తీయందే ఎల్లా ఎక్కడ్నించి తెచ్చి యివ్వనూ? అప్పుడే వెళ్లి వారి కాళ్ల మీదపడి నేనే పాపమెరుగను. కులానికి కూటికే తక్కువయినా గుణానికి తక్కువ కాదనీ...వారివంటి వారిదగ్గర తీస్తే నేను పురుగులుపడి చస్తాననీ నాకూ దైవభీతి విశ్వాసము వుందని మనవి చేసుకుందామనుకున్నాను. కానీ ధైర్యము చాల్లేదు బాబూ. పారిపోదామనుకున్నా కానీ పారిపోతే మరింత అనుమాన మెక్కువ అవుతుంది. రేపు బాబుగారి కేం జవాబు చెప్పను? అదే పు డి మీ దే భారము వేశాను...వేశానే కానీ నిద్ర పట్టలేదు. మనసు నిలకడాలేదు...పరిస్థితులన్నీ నాకిల్లా ఎదురు తిరుగుతే నేనేం చేయగలను?

లోతుకు పోయిన కళ్లలోంచి కన్నీళ్లుచెమర్చాయి. రామన్నగారికి కథ వినడానికి యిష్టం డిప్పటే సానుభూతి పూర్వక కుతూహలము కల్గింది 'బాబూ మంచినీళ్లు యిప్పిస్తారా?' రామన్నగారు పక్కనే కూర్చున్న కూతురుచేత మంచి నీళ్లు తెప్పించి యిప్పించారు. ఆ మంచి నీళ్లు తాగి మళ్లీ కథ మొదలుపెట్టాడు.

'మర్నాడు బాబుగారు పిలిచారు. కన్నకొడుక్కి చెప్పినట్లు ఎంతో నయాన్న చెప్పారు. నేను తప్ప తీసేవాళ్లు లేరని ఏదో ఆ సమయములో పుట్టిన దుర్బుద్ధివలన తీశాననీ...మర్యాదగా మంచిగా యిచ్చేస్తే నన్ను క్షమించి పనిలో వుంచుకుంటాననీ ఎంతోదూరము చెప్పారు. కానీ నేను తీయనిదే ఎల్లా తీశానని వప్పుకోను? జైలులో నన్ను పెట్టలేక కాదనీ చిన్నప్పట్నించి అంటి పెట్టుకున్నందుకు జైలులో పెట్టడము యిష్టములేదని...పోలీసులకి దయా దాక్షిణ్యాలు వుండవనీ...గొడ్డుబాగా పని చేయిస్తారనీ పని చేయలేకపోతే గొడ్డుని బాదినట్లు బాదుతారని...భయాన్న చెప్పాడు. కానీ నేను తీయలేదని తప్ప యింకేం చెప్పనూ? యిదంతా మాగన్పట్టు అనుకున్నారు. మొండివేష మేసుకున్నారు. కానీ...నేనే పాపమెరుగని అమాయకుడనని అనుకోలేదు. కన్నీళ్లు కారుస్తే అది మోసపు కన్నీరన్నారు. బాబుగారి పాదాలమీద దేవుడిమీద వట్టు పెట్టుకుంటే అవంత దొంగవేషమన్నారు. ఒకవేళ సుందరమ్మగా రేమోనన్నా. దానితో బాబుగారు మరింత రెచ్చిపోయారు. ఆవిడవంటి లక్షాధికారి యీ చంద్రహార మెందుకుతీస్తుందనీ...అందులో ఆవిడ వున్నది నాలుగయిదు నిమిషాలలో ఎలా తీస్తుందనీ...మాజాతికి పాపభీతి దైవభీతిలేదని...ఎంత గొప్పవాళ్ళయినా వాళ్ళమీద నిందలు మోపడానికి తెయారయ్యే నీచపు జాతినీ...మమ్మల్ని దయగా చూస్తే మహాముఖలనీ తేర్పనిదుముగా చూసి వదలివేయడము వంటిదని ఒకటేమిటి బాబూ నన్నూ నాజాతినీ కలిపి తిట్టారు.

'మరి సుందరమ్మగారే నా తీసింది?' రామన్నగారు అడిగారు.

'అవును బాబూ ఆవిడ తీసిందంటే ఎవరూ నమ్మరు ఆవిడ లక్షాధికారి... కనుక ఆవిడ కట్లాంటి బుద్ధుండదు. మేము కూటికీ గుడ్డకీ మొగము వాచినవాళ్ళము కనుక మాకేఆ దుర్బుద్ధులు.' అన్నాడు ఎంతో నిరుత్సాహముగా.

"అవునోయి దొంగబుద్ధిగొప్పవాళ్ళలో కూడా వుంటుంది...బీదవాళ్ళలో కూడా నిజాయితీ వున్నవాళ్ళున్నారు. దొంగతనానికి కులానికి ఏం సంబంధములేదు. దొంగతనానికి సుజాతి కేసంబంధందను" అని రామన్నగారు ఊరడింపుగా చెప్పారు.

యింత నయాన్న భయాన్న చెప్పినా నేను వినలేదని బాబుగారి కెంతో కోపమొచ్చింది. నాగడపనుంచి తక్షణము దిగి వెళ్ళిపొమన్నారు. అమ్మగారు కూడా వచ్చి ఎంతో యిదిగా చెప్పారు. నేను వెళ్లిన వారి కాళ్లమీదపడితే వారు నన్ను గెంటేశారు. నేనంటే ఎంత ఆదరమో అంత కోపముగా మారింది బాబుగారికి, నేనేం చేయను? నేనిల్లా బుజాపు పప్పుకోనా అమాయకత్వాన్ని? దీనికంతా కారణము సుందరమ్మగారేకదా అని వళ్ళికోపముతో ఆ విడింటికివెళ్ళాను. ఆవిడ లోపలవుంది. పరాబుగారు బయట వున్నారు.

'వెంవెంకొవచ్చావ్?' అన్నారు పరాబుగారు.

"అమ్మగారేరి?" కోపముగా.

'యిదుగో నీకోసము వాళ్ల వెంకడు వచ్చాడు' అన్నారు పరామగారు భార్యతో.

'ఎందుకో మీరే కనుక్కొండి' అంది ఆవిడ లోపల్నించి." ఎల్లాగయినా నా మొగము చూడ్డానికి ఎల్లా చెల్లుతుంది?

నేను ఎంత చెప్పినా ఆవిడ బయటకి రాలేదు. నేనుమనసులోదంతా వెళ్ళేసి... ఆ చంద్రహారాన్ని యిచ్చేయమని చెప్పాను. యిది విని ఆవిడ బయటకివచ్చి తాగివచ్చి మాట్లాడుతున్నాననీ...లేచి ఎవరి మొగము చూశానో కానీ క్షుద్రపెనవ చేతమాటలుపడుతున్నానని దీర్ఘాలుతీసింది. నేనేదో అంటుంటే పరాబుగారువచ్చి చెప్పు తీసుకుని అడ్డమయిన కూతలు కూస్తావా అంటూ యీ దవడా ఆ దవడమీద తపతప బాది నన్ను గెంటేశారు. యింకేంచేయను? నే నేపాపమెరుగనని ఎల్లా బుజావు పర్చుకోనూ?... అన్నాడు కన్నీళ్లుకారుస్తూ.

ఆ స్థితిలో వెంకడ్ని చూస్తే రామన్నగారికి జాలికలిగింది. సానుభూతి హెచ్చింది. "తర్వాత, ఏం జరిగింది" అన్నారు భారముగా.

ఆ విధముగా ప్రొద్దున్నే కుక్కలా వెళ్ళగొట్టబడి...పిచ్చి కుక్కలా ఏం చేస్తున్నానో తెలియకుండా ... ఏం జరుగుతోందో తెలియకుండా వూరంతా తిరిగాను. నేనేపాపము చేశానని నామీద ఈ నింద? నా అమాయకత్వాన్ని బాబుగారికి తెలిసేట్టు చేయమని భగవంతుణ్ని ప్రార్థించా...యీ విధముగా దొంగగా బతకడముకన్నా ఏ కారో ఏ బండో పోయి చచ్చిపో కూడదా అనుకున్నా. కానీ ఏ కారూ పోలేదు; దుక్కలాగా చచ్చిపోకుండా వున్నాను. కనీసము చావనైనా చావలేకపోయాను. అల్లాగా రాత్రిదాక తిరుగుతున్నా. రాత్రి అవుతే యింకెక్కడికి పోను? నా గుడిసెకే పోయాను. గుడిసెకు వెళ్ళగానే సుబ్బి అడిగింది "ఏపని యిదంతా...అట్టాంటివాళ్లు దగ్గరతీస్తే పురుగులుపడి చావవా...యిప్పటికయినా బాబుగారూ అమ్మగారూ మర్యాదగా యిచ్చేయమంటున్నారు ఇచ్చేయమని."

సుబ్బి కెల్లా తెలుసు? రామన్నగారి ప్రశ్న.

నన్ను అల్లా యింట్లోంచి తరుముగానే వా రిద్దరూ సుబ్బిని పిలిపించి సంగతి సందర్భాలు అన్నీ వివరముగా చెప్పి నేను తప్ప యింకెవరూ తీసేవాళ్లు లేరనీ...చిన్నప్పట్నించి అంటిపెట్టుకువున్న నన్ను జయిలుకి పంపించడానికి మనసొప్పడములేదని ...తెలిసో తెలియకో తీసివుంటుకు తమకేం బాంగా లేదని, కానీ ఎంతచెప్పినా మాట వినకపోవడము బాధగావుందని ... చివరికి తాము చెప్తే వినలేదని సుబ్బి చెప్పినా వింటానేమోనని పిలిపించారట ... రెండు రోజులలో దాని ఆమాకి చెప్పకపోతే పోలీసుల కప్పచెప్పడము ఖాయమని... తమ మంచితనాన్ని సూటిగా తీసుకుని మోసగించేవాళ్ళు అంతు కనుక్కుతీరతామని ... చెప్పారట బాబూ ఎరుగున్నవాళ్ళంవరిచేత చెప్పించారు. కానీ నేను తీయందే ఏంచేయను బాబూ? సుబ్బి కూడా నేను తీయలేదంటే నమ్మలేదు. అవును బాబూ చిన్నప్పట్నించి పెంచి పెద్దచేసినవారే నన్ను నానిజాయితీని ఎరక్కపోతే మర్నీ వచ్చిన సుబ్బి నమ్ముతుందా ఎంతో నిరాశతో చేతులలో తల కప్పుకుంటూ.

వెంకడు ప్రస్తుతమాట వకీలుగారిని అనడు, పైగా వారంటే భక్తి విశ్వాసము కన్పరుస్తూ నేవున్నాడు యింత జరిగినా? అదే మనము అయితే వకీలుగార్ని ఎన్నిమాటలనివుండుమో. కూటికివున్నవాళ్లలోకన్న కూటికిలేనివాళ్లలోనే విశ్వాసమెక్కువ, అని రామన్నగారు అనుకున్నారు.

"పోనీ సుందరమ్మగారు తీశారేమోనని వకీలుగారు ఆయనభార్య ఎవ్వరూ అనుకోనైనా అనుకోలేదా? రామన్నగారు అడిగారు.

'అల్లా ఏమాత్రము అనుకున్నా నన్ను అల్లాచేసేవాళ్ళేకాదుబాబూ!

'ఆవిడనిఏంఅనలేకనీమీద పెట్టారేమో.

'ఆవిడని ఏంతనలేకపోతే నామీదెందుకు పెడ్తారుబాబూ' వెంకడమాయకంగా అడిగాడు.

'మరి ఎవర్నో ఒకర్ని శిక్షించాలిగా'

'బాబుగారట్టాంటివారు కాదు. నా మీద పూర్తిగా అనుమానముండబట్టే అలా చేశారు. నేను తీయలేదని ఏమాత్రము నమ్మకమున్నా అల్లాచేసేవాళ్ళేకాదు.'

'అదికాదోయి...' అంటూ రామన్నగారు ఏదో సమర్థిస్తూ.

'చిన్నప్పట్నించి ఎరుగున్నా బాబుగారి సంగతి నాకు బాగా తెలుసు'.

'అయితే సరేలే తర్వాత'

'తర్వాత ఏముందిబాబూ...మా గూడెములో చెప్పుకుంటూవుంటారు...దొంగలని ఎంతబాధపెడ్తారో...ఆ బాధలన్నీ పడకుండా పారిపొమ్మని సుబ్బి చెప్పింది 'ఎక్కడికి పారిపోనూ' అని అడిగా, 'ఎక్కడికయినా... ముందు పారిపో తర్వాతసంగతి చూద్దాము...'అంది. నేను సుద్దిగా పారిపోయాను. కానీ ఏం లాభము బాబూ పదిహేనురోజులు తిరగకుండానే పట్టుపడ్డా...దాంతో నామీది అనుమానము మరింత ఎక్కువయింది. నన్ను జైలుకు లాక్కువెళ్లారు.

'మరినువ్వు జయిలులోవుంటే పెళ్లాము బిడ్డలగతి.

"నాకు అట్టాంటిభయములేదుబాబూ" అన్నాడు చిన్నహాసముతో. ఎందుకంటే మాలో పెళ్లాము పిల్లలూ తల్లీతండ్రీ అందరూ సంపాదిస్తారు. కనుక మాలో యింటిపెద్ద లేకపోయినా ఫరవాలేదు. అదంతా మీబోటివారికి, ఒక్కరిఘాడీ సంసారమంతా నడవాలి. కనుక ఆ బాధ మీకు.

రామన్నగారేం మాట్లాడలేదు.

వెంకడే అందుకుని చెప్పాడు. 'నాకు ఏడాది కఠినశిక్ష వేశారు...యావజ్జీవ శిక్ష వేసినా బాగుండేది వురిశిక్ష వేసినా బాగుండేది...ఏడాది అయ్యాక మళ్ళీ యీ లోకాన్ని ఏవిధంగా చూడను? జైల్లో ఎంత కష్టముగా వున్నా ఆపనే బాగుంది. కానీ ఏడాది అవగానే మళ్ళీ యీ లోకాన్ని చూడాలి.

నిర్దోషి తనమీద అపవాదు వస్తే ఎంత మానసిక బాధపడ్తాడో వెంకడే తెలుపుతున్నాడో అర్థమయింది రామన్నగారికి.

చివరకి ఏడాది అవగానే జైలు నుంచి విడదల చేశారు యిప్పుడు మళ్ళా పొట్టకి వెతుక్కోవాలి. యిక జన్మలో ఎవరి దగ్గరా నౌకరీ చేయ బుద్ధిలేదు చేసినా బాబుగారిలాంటి వాళ్లు దొరకరు. వారే నానిజాయితీని తెల్సుకోపోతే మరెవరు తెలుసుకుంటారు? జైలు నుంచి విడుదలవగానే ఆ వూళ్లో మొగము చెల్లక దూరాన్న వున్న యీ వూరికి వచ్చి చేశాను. సుబ్బినగ ఒకటి అమ్మి రిక్షా అద్దెకు తీసుకుని యీ విధముగా రిక్షా లాగుతున్నాను. చివరికి ఏడాది క్రితమే రిక్షా కొనుక్కున్నాను. మళ్ళీ బాబుగారింట్లో మా నేసిన అయిదేళ్ళకే బాబుగారినీ నన్నూ ఎరుగున్న మీరు యివాళ కన్పించారు. నాకథంతా మీతో చెప్పుకోవాలనుకున్నా ...అయితే జన్మలో ఎప్పుడయినా నా అమాయకత్వము తెలుస్తుందా బాబుగారికి.

'తప్పకుండా తెలుస్తుందోయి. నిజము నిలకడ మీదగానీ తెలియదు' అని ధైర్యము రామన్నగారు చెప్పారు. చెప్పారే కానీ ఎల్లా తెలుస్తుంది?

ఏమో బాబూ నేనే పాపమెరుగనని వాళ్ళకి తెలుస్తే అదే చాలు. అంతకన్నా ఏకోరికా నాకు లేదు.

'తెలియడమే కాక పశ్చాత్తాప పడతారు కూడాను.

'ఏమో బాబూ నాకేం నమ్మకములేదు. నేనే పాపము చేశానని నాకీవాదు.'

'అదే కర్మఫలము. కాకపోతే అప్పుడు నువ్వొక్కడివే వుండడము పంచదారకి బజారుకి వెళ్ళడము గారడీ చూసి ఆలస్యముగా రావడము సుందరమ్మగారు తప్ప ఎవరూ రాక పోవడము...యిదంతా కర్మఫలము కాక మరేమిటి' అంతకంటే సంతృప్తికరమైన జవాబుండదు.

ఒకొక్కప్పుడు ఒకరుచేసిన పాపానికి శిక్ష అమాయకులు నిర్దోషులు అనుభవించవలసి వుంటుంది. వాణ్ని బాధ పెట్టిన పాపము సత్పురుషులకి చెందుతుంది. అసలు దోషులు తప్పించుకుంటారు. తమదోషాలకి శిక్ష యింకొకరిపై రుద్దుతారు...

"బాబూ వెళ్ళి వస్తా"

యిదుగో యీ అయిదు రూపాయలు తీసుకో. అప్పుడప్పుడు కన్పిస్తూ వుండు. ఎంతో బలవంతము మీద గాని రామన్నగారు వెంకడికి ఆడబ్బు యివ్వలేక పోయారు.

వెంకడు ఆ రిక్షాని బరువుగా లాక్కుంటూ వెళ్లిపోయాడు.

దూరాన్న రిక్షాగంటలు వివిపిస్తూ వున్నాయి. రామన్నగారు అస్పష్టముగా ఆగంటలు వింటూ అల్లాగే కూర్చున్నారు.

# సంస్కృత వాఙ్మయ సంపద

ప్రా|| వెంకట కృష్ణరావు

దేవతలభాష యనబడుటచేత గీర్వాణభాష యని ప్రసిద్ధిగాంచిన సంస్కృతము సర్వ సమృద్ధమైనది సర్వాంగ సుందరమైనది. మనోహరమైనది. సంస్కృత వాఙ్మయము అనేక దేశముల వాఙ్మయములను, చైనీస్ వాఙ్మయమును, పర్షియన్ వాఙ్మయమును, యూరోపియన్ వాఙ్మయమును ఉజ్జీవింప జేసినది. భాషాంతరీకరణలద్వారా యావత్ ప్రపంచము ఉపనిషన్మధువును, గీతామృతమును గ్రోలుచున్నది. పంచతంత్రమును గూడ అనేక భాషలలోనికి అనువదించియున్నారు. ఉపనిషత్తులు, భగవద్గీత, పంచతంత్రము ఈ మూడూ యావత్ప్రపంచము అభినందింపదగిన సొత్తియునవి. చైనా జపాను దేశములలో ప్రచారమునందుండిన బౌద్ధమతగ్రంథములు, బౌద్ధ తర్కశాస్త్ర గ్రంథములు మొదట భారతదేశములో ప్రకటితమై ప్రచారములో నుండిన గ్రంథములే.

### ఉపనిషన్మధు

ఔరంగజేబు మహాశయునకు అన్నయైన అతని సోదరుడు దారాషుకో, జ్ఞాన విజ్ఞాన శోభితుడైన దారాషుకో 50 ఉపనిషత్తులను పర్షియన్ భాషలోనికి భాషాంతరీకరించెను. భారతీయ విజ్ఞానామృతమును నిరంతర గ్రోలిన షోపెన్‌హార్ తత్వవేత్త యేమి చెప్పెనో చూడుడు. "నా జీవితమునకు ఊతగల్గినవి నిలిచినవి, నా జీవితమునకు శాంతి చేకూర్చినవి ఉపనిషత్తులు, మహాభారతమే. మరణసమయమున గూడ నాకు శాంతి నొసంగునవి ఈ ఉత్తమ గ్రంథములే. సర్వ ప్రపంచములో ఈ గ్రంథములతో సాటియైన జ్ఞానదాయకములగు గ్రంథము లెవ్వియు లేవు' అని షోపెన్‌హార్ తత్వవేత్త నుడివెను. ఈ పాశ్చాత్య తత్వవేత్త ప్రతినిత్యము, క్రమము తప్పకుండా ఉపనిషన్మంత్ర పురస్సరముగా ప్రార్థన గావించుచుండెను. ఉపనిషత్తులు ఇటాలియన్, స్వీడిష్, జర్మన్, స్పానిష్ మున్నగు యూరోపియన్ భాషలలోనికి అనువదింపబడినవి.

సంస్కృత వాఙ్మయ మహావృక్షమునకు శాఖలు అనంతములు. మనోహరమైన శైలితో కథలల్లు నేర్పు హిందువుల సొమ్ము. పంచతంత్రమునందలి కథలను చూచియే పాశ్చాత్యులు కథలను కూర్చు విధానము నేర్చుకొనిరి.

జీవునికి దేహాంతర ప్రాప్తికలదను సిద్ధాంతము భారతదేశమునకు విలక్షణమైనది. ఈ సిద్ధాంతమును గాఢముగా నమ్మినవారగుట చేత క్రీస్తు జననమునకు అనేక సంవత్సరములు పూర్వమే పక్షులు, జంతువులు భాషింపగలవని భారతీయులు భావింపగలిగిరి. ఈ పక్షులు, మృగములు తమ పూర్వజన్మలలో మానవులుగా నుండియుండవచ్చుననియు, ఈ కారణముచేత అవి మానవులవలె మాట్లాడుటయు, వ్యవహరించుటయు సాధ్యమని భారతీయులు తలచిరి.

తత్వవిచారణలోనైనను సరే, కల్పనా చాతుర్యమునందైనను సరే, మన పూర్వీకులు అత్యున్నత శిఖరముల నందుకొనగలిగిరని సంస్కృత వాఙ్మయము వేనోళ్ళ నిరూపించుచున్నది.

### స్వర్ణయుగము

చిరకాలము క్రిందటనే వాత్స్యాయనుడు చతుష్షష్టి కళలను పేర్కొనియున్నాడు. ఒక్కొక్క శాస్త్రములో యెంత జ్ఞానము సంపాదించబడెనో ఈ శాస్త్రములను తిలకించినంత మాత్రముననే మనకు తెలియగలదు. సంస్కృత సారస్వత చరిత్రలో స్వర్ణయుగము, కల్పనాయుగము క్రీ|| శ|| మూడు లేక నాల్గవ శతాబ్దముతో అంతమయ్యెను. ప్రపంచమునందలి వ్యాకరణములందెల్ల సర్వ సంపూర్ణమైన వ్యాకరణమును రచించిన పాణిని క్రీ|| పూ|| 700 సంవత్సరముల ప్రాంతమున ఈ యుగ ప్రారంభకుడయ్యెను. కరుణారస యుక్తములతో కూడినదియు, అత్యంతమధురమైనదియునగు రామాయణ మహాకావ్యము రచించిన వాల్మీకి మహామునియు, ప్రపంచములో సద్భవించిన ప్రథమ నాట్యాచార్యుడైన భరతమునియు సంస్కృత సారస్వత మహాకాశమున ఉజ్వల తారలుగానుండిరి. పంచమ వేదమగు మహాభారతమును రచించిన వేదవ్యాసుడు స్వర్ణ తారగా నుండెను. పిదపవాత పేర్కొనదగినవాడు కౌటిల్యుడు. ఇంత ప్రజ్ఞాశాలియగు మహామంత్రి ప్రపంచములో పుట్టియుండలేదు. పతంజలి, కపిలుడు, ఇతర దర్శనకారులు అద్వైత శాస్త్ర ప్రవర్తకులగు శ్రీ మచ్ఛంకర భగవత్పాదులు ఈ స్వర్ణయుగమునకు జెందినవారే.

మహమ్మదీయుల ఆగమనముతో సంస్కృత సారస్వతము తన ప్రాశస్త్యము కోల్పోయెను. బ్రహ్మ విద్యకు, తత్వవిచారణకు కొంత తన ప్రాముఖ్యము తగ్గి లౌకిక వ్యవహారములలో ఉపకరించు విద్యకు ప్రాముఖ్యము హెచ్చెను. భావ ప్రపంచ విహారములు వాస్తవికవృష్టికి తావొసగెను. ఈ కాలములో భాగవతమునందలి గోపికాగీతములవంటి శృంగార-భక్తి గీతములు, గీతగోవిందమువంటి మధుర కావ్యములు వెలసెను. ఈ కావ్యములలో భక్తికల్పనా వైచిత్రి అపూర్వముగా సమ్మిళితములై యున్నవి. ఈ విధముగా మన పూర్వీకులు భిన్నత్వములో ఏకత్వము దర్శించిరి ఇందువల్ల మన సారస్వతములో ప్రతిబింబితమైయుండిన తత్వజిజ్ఞాస, తగ్గినది. కావ్యములను విషాదాంతములుగా చేయవలెనను ఉద్దేశ్యము సంపూర్ణముగా అదృశ్యమైనది.

తమ కావ్యములను విషాదాంతములుగా చేయుటయే ప్రాచీన సంస్కృత కవి పుంగవుల యభిమతమైయుండెనను విషయము రామాయణ మహాభారతములవల్ల స్పష్టమగుచున్నది. మొదట ఈ రెండూ విషాదాంత కావ్యములుగానే ఉద్దేశించ బడినవి. రామాయణము విషాదాంతమే కాని తరువాత రోజులలో రామాయణము ఆదిలేక అదర్శప్రాయమగు కావ్యమను భావము పెంపొందుటచేత ఉత్తరకాండను అనగా అన్నిటికంటె శ్రేష్ఠమైన కాండను ప్రక్షిప్తమనిరి. రామకథ సుఖాంతము కావలెనని అనగా పట్టాభిషేకముతో నంతము కావలెనని ప్రజలు కోరుచుండిరి. ప్రజల అభిప్రాయమును మన్నించుటకు ఉత్తరకాండ ప్రక్షిప్తమనిరి.

జీవునికి దేహాంతర ప్రాప్తికలదను సిద్ధాంతముయొక్క ప్రభావము జీవితములోను, సారస్వతములోను బాగా కనబడినది. ఈ జీవితము యింతటితో అంతము కాదని, అనంతమగు జననమరణపరంపరలలో నిదియొక్కటి యను అభిప్రాయము రూఢమైనది. ఈ కారణముచేత 'పుణ్యః పుణ్యేన పాపం పాపేన' అను నైతిక సిద్ధాంతము సారస్వతమునకు జోడించబడినది. ఆదర్శవాదము తత్వశాస్త్రమునకు సైదోడని భావింపబడినది.

మానవుడు సరిగా ప్రవర్తించిన యెడల అద్భుతరసము మానవునికి మిత్రముగా నుండునను అభిప్రాయము ప్రబలెను. ఈ కారణము చేతనే ఋషిరచనలయందలి దుఃఖాంతములు సుఖాంతములుగా మార్చి వేయబడినవి. కాళిదాసు రచించిన శాకుంతలము, విక్రమోర్వశీయముల యందును, బాణుని కాదంబరి యందును, భవభూతి ఉత్తర రామచరిత్రమునందును, శ్రీహర్షుని నాగానందమునందును యిది కానవగును. ఇచ్చటగూడ అత్యంత ప్రతిభాశాలియగు భాసుడు చిట్టచివర వరకు విషాదవాతావరణము, చెడకుండా చూచుచు ఏదో ఒక అద్భుతం జరుగకుండానే తన నాటకమును సుఖాంతము గావించెను.

వ్యంగ్యము, వక్రోక్తి సంస్కృత సారస్వతమునకు విలక్షణములు వ్యంగ్యములతోను, వక్రోక్తులతోను కూడిన ఒక రకపు సారస్వతము సంస్కృతములో నేర్పడినది, అన్యాపదేశములు గూడా సంస్కృతములో విస్తారముగా నున్నవి. ఒకనొక సంఘటనను వర్ణించు వ్యాజమున తన కాలము నాటి ఏదో ఒక సాంఘిక దురాచారమునకు కవి విమర్శించుట అన్యాపదేశము. క్రీ|| శ|| 8వ శతాబ్దములో జీవించిన భల్లటు నిరచన నుండి ఒక ఉదాహరణ నిచ్చెదను "ఖద్యోత మను పేరును క్షుద్ర కీటకమగు మిణుగురు పురుగుకు వర్తింప జేయుట తప్పు. లోకమును ప్రకాశింప జేయు సూర్యునికిని, కొంతవరకు చంద్రునికిని మాత్రమే ఈ పేరును వర్తింప జేయవచ్చును" అని భల్లటుడు చెప్పుచున్నాడు. తన కాలములో అనర్హులగు వారికి సమ్మానము గౌరవము లొసంగుచున్నారని కవి అభిప్రాయము.

నాటకములద్వారా తత్వమును బోధించుట సంస్కృతములో మరియొక విశేషము. ఆంగ్ల సారస్వతములో 'మెరకిల్' నాటకములనునవి కలవు. సుగుణములను దుర్గుణములను పాత్రలుగాచేసి వారిచేత మాట్లాడించుటతో ఈ నాటకములు సంతృప్తి జెందుచున్నవి. కాని సంస్కృత నాటకములు యింతటితో ఆగుటలేదు. క్రీ|| శ|| మొదటి శతాబ్దమున, కనిష్కుని కాలమున జీవించియుండిన అశ్వఘోష మహాకవి బుద్ధదేవుని ముఖ్యశిష్యులగు సారిపుత్ర మౌద్గల్యాయనుల బౌద్ధమత స్వీకారగాథను నాటకరూపమున రచించి బౌద్ధమత ధర్మములను ప్రచారముచేసెను. 11 శతాబ్దములో జీవించియుండిన కృష్ణమిశ్రుడు తన ప్రబోధ చంద్రోదయములో వివిధ దర్శనముల సిద్ధాంతములను ప్రజలకు బోధించుచున్నాడు. వేదాంతదర్శనము యొక్క నాయకత్వమునందు ఆస్తిక దర్శనముల సేనను, ఈ సేనతో పోరాడు చార్వాకాది నాస్తిక దర్శనములసేనను కృష్ణమిశ్రుడు రంగమునిదికెక్కించి వారిచేత యుద్ధము చేయించుచున్నాడు.

మన పూర్వీకులు దేశపరిపాలనలోను నదీజలముల మూలమున పంటలు పండించుటలోను, వర్తక వ్యాపారములలోను పారిశ్రామిక కార్యకలాపములలోను కుశలులై యుండిరని ప్రాచీనమైన కౌటిల్యుని అర్థశాస్త్రము స్పష్టము చేయుచున్నది.

ఇట్టి మహార్ఘతకు మూలకారణమేమో విచారించుట సమంజసము ఆనాటి విద్యాబోధనా పద్ధతివల్లనే ఈ మహార్ఘత దేశమునకు కలిగినది. ప్రాచీన భారత విశ్వవిద్యాలయములు అడవులలోను, ఏకాంత ప్రదేశములలోను నుండెను. గురువులకును శిష్యులకును సన్నిహిత సాహచర్యముండెను. గురువుల పవిత్ర జీవితము, గుణోన్నతి, దైవభక్తి శిష్యులకు మార్గదర్శకముగా నుండెను. నలంద అను పేరులోనే విద్యయొక్క ఆశయ మిమిడియున్నది. నలంద యనగా 'తగినంతగా ఎన్నడూ యిచ్చునది కాదని' అర్థము. గురువు చాలా చదివినవాడు మాత్రమేగాక చాలా విన్నవాడు (బహుశ్రుతుడు) గాగూడ నుండెను.

స్వాతంత్ర్యభానూదయముతో నూతన సృష్టికి ఉడంగవలెనను సంకల్పము భారత ప్రజలలో బయలుదేరినది. ఈ వాంఛను సహాయముగాగొని సంస్కృతము, తన పుత్రికయగు హిందీతో కలిసి భారత జాతిని బలిష్ఠమైనదానినిగా చేయునని ఆశించవచ్చును.

సంస్కృత వాఙ్మయమునకు విలక్షణమైన వ్యక్తిత్వము కలదు. ఇట్టి సంస్కృతము తన్నుదాను పునరుజ్జీవించుకొనుటయు, తన యొడల ఆదరాభిమానములుగల వారిని పునరుజ్జీవింపజేసి భారతవర్షమును తిరిగి స్వర్ణభూమిగా మార్చుటయు సులభమే.

# హోమియోపతీ వైద్యం

## నీళ్ళ విరేచనాలు

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

మలబద్ధకంకంటె నీళ్ళ విరేచనాలు చాలా చెడ్డవి. వాటినికోరి భేదిమందులతో తెప్పించుకోవడంగాని, అణచి పెట్టడంగాని ప్రమాదకరం. ఏదైనా వ్యాధితో బాధపడేవారు నీళ్ళవిరేచనాలు కలిగి దానితో వ్యాధి నివారణ అయినా, చిన్నపిల్లలకు పండ్లువచ్చే కాలమందు విరేచనాలు కలిగినా వెంటనే చికిత్స ఆరంభించ నవసరంలేదు. ఇతరవ్యాధి లక్షణాలు కనిపించడమో, విరేచనాలు వాటంతట అవి కట్టకపోవడమో జరిగితేనే పై కేసులలో చికిత్స చేయాలి.

నీళ్ళ విరేచనాలు ఆకస్మికంగాదడుచుకోవడంవల్లా, భయ విచారాలవల్లా, జలుబువల్లా, వేడివల్లా, శరీరం కాలడంవల్లా, జీర్ణకోశం చెడడంవల్లా కలుగుతాయి.

నీళ్ళవిరేచనాలు ఆరంభమైన స్థితిలో పుల్లటి పదార్థాలూ, కాఫీ, టీ, ఉప్పూ, పప్పూ (ఎండువికూడా) గుడ్లూ, కోడి మాంసం మొదలైనవి వర్జించాలి.

విరేచనాలతోబాటు, ముఖ్యంగా పిల్లలలో మూలగడం, అస్తిమితంగా అటూ ఇటూ పొర్లడం, పొట్ట ఉబ్బరించి ఉండడం; విరేచనాలు పల్చగానూ, బంకతోనూ, నరుసుతోనూ దుర్వాసన గలిగిగాని, కొంచెంకొంచెంగా తరుచు పసుపు పచ్చగా వెళుతూ ఆసనంలో తీపుగా ఉండడంగాని, మొదట నీళ్ళగానూ తరువాత పసుపు పచ్చగానూ ఆకుపచ్చగానూ మారి, విరేచనానికి ముందు పొట్ట గుడగుడలాడడంగాని ఉన్నప్పుడూ, నీరసమూ, పడుకోవాలనేకోరికా, నిద్రమత్తూ పాలిపోయినముఖమూ, కళ్ళచుట్టూ నల్లపూ, శరీరం చల్లగా ఉండడమూ, చిరచిరా ఉంటే "ఇపికాక్" ఇవ్వాలి.

"ఇపికాక్" వల్ల వ్యాధి పూర్తిగా నివారణ కాక పోయినా, బొత్తిగా ఫలితం లేకపోయినా "రియుం" వాడాలి. విరేచనం పుల్లనివాసన కొడుతుంటే ఇదే ముందుగా వాడవచ్చు.

పసిపిల్లలు ఏడుస్తూ, చంకదిగకుండా ఉన్నప్పుడూ, కొంచెం ఎదిగిన పిల్లలు వెర్రెత్తినట్టు ఏడిచి మెలికలు తిరిగి పోతున్నప్పుడూ, చంటిపిల్లలు కాళ్లు ఎగలాగుతున్నప్పుడూ, పొట్ట ఉబ్బరంగా ఉండి గట్టిగా ఉన్నప్పుడూ, విరేచనం తరుచుగా అవుతూ, బంకగాగాని నీళ్ళగాగాని, ఆకుపచ్చగానూ గోగుపువర్ణంగానూ లేక అజీర్ణంగా దుర్వాసనగా ఉన్నప్పుడూ, దీని వెంట పొట్టలో గుడగుడా, ఆకలిలేకపోవడం, దాహం, నాలుకపై పూతా, తరుచు త్రేపులూ, డోకూ ఉన్నప్పుడూ "కెమోమిల్లా" ఇవ్వాలి. ఇది పెద్దవాళ్ళకు కూడా ఉపయోగిస్తుంది. విరేచనం ఆకుపచ్చగా, నీళ్ళగా, వేడిగా, దుర్వాసనగావుండి, నోరు చేదుగావుండి, చేదుగా త్రేపులు వస్తూ, పైత్యరసం వాంతి అవుతూ, పొట్ట నిండుగానూ, నొప్పిగానూ, తలనొప్పిగానూ ఉండి, పైనుంచీ కిందినుంచీ పైత్యరసం కల్లినకొద్దీ ఉపశమనంగల కేసులకు "కేమోమిల్లా" ఇవ్వాలి.

"పల్సటిల్లా" ఇవ్వదగిన కేసులలో మిగిలినలక్షణాలన్నీ సాయంకాలంనుంచీ ఉద్రేకిస్తే, విరేచనాలుమాత్రం ఉదయం తీవ్రంగా ఉంటాయి. అల్పాచమనం తొందర జాస్తిగా ఉంటుంది. నిద్రమత్తూ, చలీ ఉన్న కేసులలోనూ, ప్రత్యేకించి పిండి వంటలు వగైరా తిని నిద్రమత్తూ చలీ తెచ్చుకున్న కేసులలోనూ మాత్రం తొందర కలిగిస్తుంది. శాంత స్వభావులకూ, ముఖ్యంగా స్త్రీలకూ పిల్లలకూ, బహిష్టు అణచిపెట్టబడిన స్త్రీలకూ "పల్సటిల్లా" చాలా బాగా పనిచేస్తుంది. అర్ధరాత్రిఅనంతరం నీళ్ళ విరేచనంఅయి దానికిముందుగా కడుపునొప్పివచ్చి, విరేచనానంతరం అది తగ్గిపోతే "రస్టాక్స్" ఇవ్వాలి. విరేచనానికీ విరేచనానికీ రంగుమారుతూ బంకపడే కేసులకు "పల్సటిల్లా" ఇవ్వాలి. విరేచనాలవల్ల అతి నీరసం కలిగితే "కోలోసింతిస్" ఇవ్వాలి. దీనివల్ల అవలక్షణాలు కలిగితే పాలులేకుండా కాఫీ తాగించాలి. విరేచనంలో బంక ఆకుపచ్చగాగాని, రక్తం కలిసిగాని ఉంటేనూ, విరేచనం కావడానికి చాలా శ్రమపడవలసివస్తేనూ "మెర్క్యూరియస్" ఇవ్వాలి.

"మెర్క్యూరియస్" ఇవ్వవలసిన కేసులలో పైలక్షణాలతోబాటు చల్లని చెమటూ వణుకూ ఉంటాయి. విరేచనాలతోబాటు నీరసమూ, శ్వాసదుర్వాసనా, విరేచనాల వెంట వాంతులూ, ఆసనం మంటా దురదా కూడా ఉంటాయి.

ఇతర ఔషధాలు పనిచేయని కేసులకు "సల్ఫర్" ఇవ్వాలి. (ఇంకా ఉంది)

















GOVERNMENT OF INDIA

DEPARTMENT OF INDUSTRIES AND SUPPLIES.

GOVERNMENT TEST HOUSE, ALIPORE, CALCUTTA.

TEST CERTIFICATE

No. O/PC/1081 dated the 16. 11. - 1949.

Issued to Messrs. Sriram Nandram (Calcutta) Ltd., 47, Khengrapatty Street, Calcutta.

with reference to letter No. B/83/G/AMS dated the 3. - 11. - 1949.

Register No. 766-PC. Dated the 7. 11. 49.

Sample received on the 4.11.49 in a one-pound bottle.

One sample of lubricating oil described as "Engine Oil SAE 30".

Results of tests:

| | | |
|---|---|---|
| Specific gravity at 30 /30°C | ... | 0.896 |
| Viscosity (Redwood) at 60°C (140°F) | ... | 149 Secs. |
| Closed flash point (Pensky-Martens) | ... | 200°C |
| Setting point (I.P.) | ... | Below 0°C |
| Ash | ... | 0.2 % |
| Acid value | ... | 0.2 |
| Saponification value | ... | 2.1 |
| Colour by transmitted light in 1/8" cell, (Lovibond Lubricating oil standard) | ... | Between Nos. 1 & 2. |
| Odour | ... | Like that of oil containing additives. |

Remarks.. The sample shows a Redwood viscosity at 60°C of 149 seconds which lies within the range 130-175 seconds stipulated in B.S. specification No. 210-1939 for SAE 30 grade oils. The sample practically conforms to D.G. I & S. specification No. G/O-101/12 for oil, internal combustion engine, medium.

S. C.

for Director.

# గౌరమ్మ ఉపాయం



ఆనగా అనగా ఒకవూరు. ఆవూర్లో అవధాని అనే ఒక బ్రాహ్మణుడున్నాడు ఆయన చాలా మంచి మనిషి. చాలా పూర్వకాలపు మనిషి. ఆయనకు తింటానికి అన్నంగాని, కట్టుకోటానికి గుడ్డగాని లోటు లేదు. ప్రతిరోజూ తన ప్రక్కనే ఎవరైనా మరొక విప్రుడికి భోజనం పెట్టనిదే తాను తినడు అవధాన్లుగారికో భార్య వుంది. ఆవిడ పేరు గౌరమ్మ. చాలా తెలివైన మనిషి. అవధానిగారి ఆచార వ్యవహారాలు ఆమెకే గిట్టవు. ప్రతిరోజూ మరో బ్రాహ్మడికి వంటచేసి పెట్టాలంటే ఆమెకు గిట్టదు. అందుకనే తన భర్తతో చాలాసార్లు చెప్పింది. కాని అవధాని అలా వూరుకుంటే ఘటం కాదు. తప్పక వంట చెయ్యాల్సిందే అన్నాడు ఎలాగైనా తనయింటికి, యిక పరాయి బ్రాహ్మణులు రాకుండా చేయాలని ఆమె ఒక వుపాయం పన్నింది.

ఒకరోజు అవధాన్లుగారింటికి దీక్షితులు అనే ఆయన వచ్చాడు భోజనానికి. ఆయన బాగా చదువుకొన్న మనిషి. శాస్త్రాలూ వేదాలూ బాగా చదువుకొన్నాడు. అటువంటి బ్రాహ్మడు తన గృహంలో భోజనం చేస్తే తన జన్మసార్థక మౌతుందనుకొన్నాడు అవధాని.

దీక్షితులుగారిని బయట పంచలో ఒక మంచంమీద కూర్చోబెట్టి, అవధాని వంట యింట్లోకొచ్చి భార్య గౌరమ్మతో: "ఏమేవ్! ఈ దినం మన యింటికి దీక్షితులుగారొచ్చారు. ఆయన శాస్త్రాలూ అవీ బాగా చదువుకొన్న మనిషి. వంటా అదీ బాగా చెయ్యి. ఇదిగో యిలా చూడు! ఇంట్లో వంకాయలూ...దోసకాయలూ వున్నాయి గదూ! ఇంకేం అవి కూరా పులుసూ చేసి, పప్పుచేయి, రాత్రి నానవేసినమినపప్పుతో గారెలు కూడా చేయి...వంట కేగిరంగా కాని మరి... నేను వెళ్ళి స్నానం చేసి వస్తాం." అని చెప్పాడు.

స్నానంచేస్తూన్న గౌరమ్మ వినయందా "సరే లెండి" అన్నది. అవధాన్లూ, దీక్షితులూ వూరి బయటవున్న నదికి వెళ్ళారు స్నానం చేయటానికి.

దీక్షితులుగారి స్నానం త్వరగానే అయింది. కాని మన అవధాన్లుగారి స్నానం యిప్పుడల్లా పూర్తి ఆయ్యేట్లు లేదు. ఇంకా ఏవో మంత్రాలు చదు

బి. రాజగోపాలరావు

వుతూ, చేతుల్లో జంధ్యాన్ని అటూయిటూ తిప్పుతూ నీళ్లలో మునిగి మళ్ళా నిలబడుతున్నాడు.

"నేనుసంధ్యావార్చుకొని త్వరగావస్తాను. మీరు యింతలో యింటికి పదండి మీ వెనకాత్తే వస్తానేను" అన్నాడు అవధాని.

"సరే" నంటూ దీక్షితులుగారు మెల్లెగా బయలుదేరి అవధాని గారింటికి వచ్చాడు. దొడ్లో కెళ్ళి, మడిబట్ట ఆరేసేందుకో తేలో మాని ఏకంగా మడికట్టుకొని కూర్చుందామని దొడ్లో కెళ్ళాడు.

దొడ్లోకివెళ్ళిన దీక్షితులుకు ఒకవింత కన్పడింది.

అవధాన్లుగారి భార్య గౌరమ్మ ఒక పత్రానికి మన్న పుబొట్లూ కుంకుమబొట్లూ పెట్టి, ఖాళీరోట్లో దాన్ని వేసి రుబ్బుతూ కూర్చుంది. మడిబట్టకోసం వచ్చిన దీక్షితులు చూసి చూడనట్లుగా.

గౌరమ్మవాలకం చూసేసరికి దీక్షితులుకు చాలా ఆశ్చర్యం వేసింది. "ఏమి



టండీ! ఖాళీరోట్లో పత్రంవేసి రుబ్బుతున్నా రేమిటీ? పైగా పత్రానికి పసుపూ కుంకుమా దేనికీ?", అన్నాడు అమిత ఆశ్చర్యంతో,

వెంటనేగౌరమ్మ జంకూ గొంకూ లేకుండ "అయ్యో! ఏమిచెప్పమన్నారండీ! తల్చుకుంటే నాగుండె పగిలిపోతుంది! మావారు ప్రతిబ్రాహ్మడినీ యిలాగే భోజనానికి రమ్మని చెప్పి కడుపు నిండా భోజనంపెట్టి ఆఖరుకు వాళ్ళు కన్నతానుముందులేచి, ఈ పత్రంతో వాళ్ల తలపగులకొడ్తాడు! రోజూయిదేవరస! పాపం ఈరోజు మీకాయువు మూడింది" అని ఆశ్చర్యాన్ని, విచారాన్ని అభినయిస్తూ గుక్కతిప్పుకోకుండా చెప్పేసింది. ఆమాటలు విసేసరికి దీక్షితులుగారికి మూర్ఛ వచ్చినంత పనయింది. "ఈయన భోజనంమాట దేముడెరుగు. బ్రతికుంటే బలిసాకు తినయినా బ్రతుకవచ్చు!" అనుకొని మూటాముల్లే తీసుకొని తడిబట్టయినా విడవకుండా అవధాన్లగారింట నుండి దబదబా పరుగెత్తటం మొదలెట్టాడు.

ఆ సమయానికే అవధాన్లగారు స్నానం సంధ్యా పూర్తిచేసుకొని తన గృహాన్ని సమీపిస్తుండగా తన యింట్లోంచి తడిబట్టతో మూట పట్టుకొని గాభరాగా పరుగెత్తుతూన్న దీక్షితుల్ని కళ్లారచూశాడు. ఆయనకుబలే ఆశ్చర్యం వేసింది. "ఏమండోయ్! దీక్షితులుగారూ! ఎందుకూ అలా పరుగెడ్తారు? ఆగండి! అని అరచాడు. కాని వెనక్కు తిరిగి తన్నుచూసి మరీ భయంతో పరుగెత్తటం చూసి మరీ విభ్రాంతుడైనాడు అవధాని.

ఈ సంగతంతా ఏమీ అర్థంకాక ఎకాఎకిని తన భార్యవద్ద కెళ్ళి, "ఎందుకే ఆ బ్రాహ్మడు అలా పరుగెత్తి వెళ్ళిపోతున్నాడూ?" అని అడిగాడు.

"చాల్లెండి! చదువుకొన్నవాడు కదా, ఆమాత్రం నీతీ నియమం అక్కర లేదూ? నేను గారెలకని పప్పు రుబ్బుతూంటే ఆయనవచ్చి సిగ్గూ బిడియమూ లేకుండా, 'నాకా పత్రం కావాలి యిస్తావా యియ్యవా?' అని కూర్చున్నాడు. నేనివ్వనంటే యియ్యవన్నాను. అందుకని కోపంతో వెళ్లిపోతున్నాడు." అని గబగబా చెప్పేసింది గౌరమ్మ.

"ఓసీ నీయుపాయెంగా! ఎంతపని చేశావ్! చదువుకొన్నవాడూ...పండితుడూ అడిగినందుకు ముష్టి పత్రం యివ్వలేక ఆయన మనస్సును కష్టపెట్టావ్! ఏదీ...ఆ పత్రం యిలా ఇవ్వు. నే వెళ్ళి ఆయన కిచ్చి యింటికి తీసుకొస్తాను." అని చెప్పి, పత్రం తీసుకొని దీక్షితులు వెంటబడ్డాడు. "ఇదుగో నయ్యా పత్రం! తీసుకుపోదువుగానిరా!" అంటూ వెంటపడ్డాడు.

దీక్షితులు వెనక్కి తిరిగి చూసి, పత్రం పట్టుకొని తనవెంట పరుగెత్తుకొని వస్తూన్న అవధాన్లను చూసి, ... "రానే వస్తున్నాడురా నాయనా! నాపాపం ఈ వేళ పండింది. పాపమా యిల్లాలు పుణ్యమా అంటూ చెప్పింది. లేకపోతే........" అనుకొంటూ మరి వేగంతో లంఘించారు.

"పత్రం తీసుకుందువుగాని రావయ్యా!" అని వెనక అవధాన్లూ, "నాకూ పెళ్లాం బిడ్డలున్నారు......కొంతకాలం బ్రతకనివ్వు........" అంటూ దీక్షితులు ముందూ ఒకటే పరుగు?

పాపం! ఇద్దరూ పూర్తిగా అలసిపోయారు. తాను ఆగితే అవధాన్లొచ్చి తన తల పగులకొట్టేస్తాడేమోనని ప్రాణ భీతికల దీక్షితులూ చదువుకొన్న పండితుడికి అడిగిన వస్తువు యియ్యకపోతే తన కేం పాపం చుట్టుకుంటుందో అని పాపభీతిగల అవధాన్లూ పూర్తిగా అలసిపోయినా ఆయాసాన్ని దిగమింగుకొని రొప్పుతూ పరుగెత్తుతున్నాడు!

ఇంతలో దీక్షితులు అదృష్టవశాత్తూ అవధాని చేతిలో పడకముందే ఒక పల్లెటూరు చేరుకొన్నాడు. అక్కడ ఒక అరుగుమీద పదిమందిచేరి ఏదో మాట్లాడుకొంటూంటే వాళ్ల మధ్యకెళ్ళిపడి, "రక్షించండి..." రక్షించండి!! అదుగో వస్తున్నాడు చంపటానికి..." అన్నాడు అమిత ఆయాసంతో.

వూడిపోతున్న గోచి పెట్టుకోకుండా ఆయాసంతో రొప్పుతూ పరుగెత్తుకొని వచ్చిన దీక్షితులుని చూచేసరికి వాళ్ళు జాలివేసింది.

"భయపడకు స్వామీ!భయపడకు... సంగతేమిటో చెప్పు" అన్నారు.

దీక్షితులు, పత్రం పట్టుకొనివస్తూన్న అవధానినిచూపి "అదుగో ఆయన నన్ను చంపటానికి వస్తున్నాడు. రక్షించండి!" అని వేడుకున్నాడు.

ఇంతలో అవధాన్లు ఆ గుంపును సమీపించి అందరిముందూ భయంతో వణుకుతూన్న దీక్షితులుతో "ఏమయ్యా! నిన్ను గాదూ యిందాకట్నుంచి పిలుస్తున్నా పలక్కుండా అలా పరుగెత్తుతావేం? నీకేమయినా పిచ్చా? ఇదుగో పత్రం...రా!" అన్నాడు తానుగూడా రొప్పుతూ...

ఆ గుంపులో నుంచి ఒకడు ముందుకొచ్చి "ఎందుకయ్యా రావటం? ఏం చేస్తావేం? మేమింత మంది వుండగానే చంపుతావా?" అన్నాడు.

మరొకడు. చంపుతాడుగా! అయినా ఏ మాత్రం చంపుతాడో చంపమను..." అన్నాడు. గుడ్లెర్ర చేస్తూ "పాపమా బ్రాహ్మడు ఏం చేశాడయ్యా నిన్ను? చంపటానికి?" అన్నాడు ఇంకొకడు.

వాళ్ళందరూ అలా అనటం వినేసరికి అవధాన్లుకు ఏమీ అర్థంకాక, "చంపటమేమిటి? నేనెందుకు చంపుతాను ఆయన్ని? నాకెందుకు?" అన్నాడు ఆమాయకంగా.

అంతవరకూ వూరుకొన్న దీక్షితులు, "ఇంతమంది వున్నారని అబద్ధమాడుతున్నావ్. నాకు తెలుసు నీసంగతంతా... నీభార్య చెప్పిందిలే!" అన్నాడు మహా తనకుఅంతా తెలిసినట్లు.

"ఏంచెప్పింది? నేను నిన్ను చంపుతాననా? రా! మా యింటికిరా! దాన్ని అడుగుదాం..." అన్నాడు పట్టుదలతో.

అంతవరకు తమాషా చూస్తున్న పెద్ద మనుష్యులు దీక్షితుల్ని, "ఏమని చెప్పిందయ్యా ఆవిడ గారు?" అని అడిగితే దీక్షితులు జరిగినదంతా పూస గుచ్చినట్లు చెప్పేశాడు.

"నిజంగా నాభార్య అలా అన్నదా?" అన్నాడు అవధాని.

"ఊ నాతో అలా చెప్పింది మరి నిజమో అబద్ధమోమరి!" అన్నాడు దీక్షితులు.

"మరి నాతో, మీరు పత్రం ఇవ్వమని అడుగుతే యివ్వలేదని కోపంతో పోతున్నారని చెప్పింది! అందుకే. పత్రం యిద్దామని తెస్తున్నా..."అన్నాడు గుటకలుమింగుతూ.

"చాలు చాలు! అవేం మాటలూ? నాకు దేనికి ఆ పత్రం!" అన్నాడు కోపంతో. అభిమానంతో—దీక్షితులు. చుట్టూవున్న జనమంతా అంతా అర్థమయినట్లు ఘక్కుమన్నారు. పాపం అవధాన్లుగారికి తలకొట్టేసినట్లయింది. "అంతాఅది చేసింది..." అని మనస్సులో అనుకొంటూ యింటిదారి పట్టాడు.

"బ్రతుకుజీవుడా;" అనుకొంటూ, గోవతి సరిచేసుకొని తనదారిన తాను పోయాడు దీక్షితులు.

ఆరోజునుంచీ అవధాన్లు గారింటికి ఎంత పిల్చినా ఎవ్వరూ భోజనానికి పోరు. అవధానికూడా పిలవటం మానేశాడు. గౌరమ్మకు మాత్రో మనిషికి వంట చెయ్యాల్సిన పని తప్పిపోయింది.





# స్నేహము

అనగనగా ఒక కోడి. మరొక కుక్క రెండూ ఎంతో స్నేహంగా ఉండేవి. ఆ రెండూ అడవిలో వెళ్తూ చీకటిపడటం మూలాన ఒక చెట్టుదగ్గిరకు వచ్చి చెట్టుకొమ్మ మీద ఆ కోడి చెట్టు తొఱ్ఱలో కుక్క నిద్రపోయాయ్.



మరునాడు ప్రొద్దున్నే, తన మామూలు అలవాటు చొప్పున ఆకోడి, చెట్టుకొమ్మమీద కూర్చుని "కొక్కొ-రోకో" అని అంది.

ఇది విన్న ఒక నక్క, తనకు మంచి ఆహారము బాగా లభించిన దని అక్కడకువచ్చి "కోడి బావా! నీవు బాగుగా పాడగలవ్! ఏదీ ఒక పాట అమయా పాడగలవా? అన్నది.

"ఆ నేను అట్లాగే చేస్తాను కాని నీవు ఆ చెట్టుతొఱ్ఱలోవున్న నా స్నేహితుని నిద్రనుండి లేపితే.

మా॥ శాంతకుమారి

మే మిద్దరముకలిసి పాడి నిన్ను ఆనందింపచేస్తాము అన్నది.

ఆ చెట్టుతొఱ్ఱలోకూడ మరొక కోడి వున్నందుకు తన అదృష్టము నకు సంతోషించుచూ ఆతొఱ్ఱలో తన ముట్టెపెట్టింది. వెంటనే కుక్క బయటకువచ్చి ఆ నక్కని చంపివేసింది.

చూశావ్! కుక్క అన్నా నీవు నా ప్రాణం రక్షించేవ్! నేను నీకు ఆహారం సంపాదించి పెట్టెను. మనం ఇట్లాగే ఎప్పుడూ స్నేహంగా ఉందాము. అన్నది కోడి కుక్కతో.

కథ కంచికి మనం మనయింటికి.



ఎవరి వెంట ఎవరు?

# భారత జాతీయ నౌకా దిన మహోత్సవం



దళాలకు శిక్షణ నివ్వటానికి ఉపయోగించే శిక్షణశాఖా నౌక "హెచ్. యం. ఐ. యస్. తీర్"

## బలిష్ఠ నౌకాదళ ఆవశ్యకత

(లెఫ్టినెంట్ కమాండర్ ఎన్. కృష్ణన్)

ఒక జాతియొక్క సంపద, అభ్యుదయం, ఇతర దేశాలతో అది చేసే వ్యాపారం మీద ఆధారపడిఉన్నది. మూడువైపులా సముద్రంచేత ఆవహించబడినందువల్ల ఇండియా వ్యాపారంలో అత్యధికభాగం సముద్రం ద్వారానే జరగక తప్పదు. దూరదేశాల మధ్య నౌకలే చౌకరవాణానూ, భద్రతనూ ముఖ్య సాధనాలుగా ఉన్నంతవరకూ భారతదేశం వాణిజ్యనౌకల నిర్మాణాన్ని ముఖ్యంగా పరిగణించక తప్పదు.

ఇప్పుడు ఇండియా అనేక వస్తువులు-యంత్రసామగ్రులు, పెట్రోలు, ఆహారం, పెద్దఫిరంగులు, విమానాలు, టాంకులు - మొదలైనవాటన్నిటికీ విదేశాలమీద ఆధారపడిఉన్నది. భారీయుద్ధ పరికరాలను చాలాకాలంవరకూ దిగుమతి చేసుకొనక తప్పేట్టులేదు. కాని అవచ్చేసరుకులైనా త్రివర్ణపతాకం ఎగరవేసే మన నౌకలలోనే తీసుకొనిరావటానికి మనం ప్రయత్నించాలి.

మన సముద్ర వాణిజ్యం నిధికి అపాయం వచ్చిందంటే ఆర్థిక జీవితాన్ని పీక నలిపిచంపటం జరుగుతుంది. యుద్ధం వస్తే శత్రువు మొదట ఈ పనిని చేయటానికే ప్రయత్నిస్తాడు. మన సప్లయి నౌకలన్నిటినీ ముంచి మనలను మాడ్చిచంపటానికి అంతడు ప్రయత్నిస్తాడు. ఇటువంటిది జరక్కుండా ఉండాలంటే మన సముద్ర మార్గాలను రక్షించటానికి బలిష్ఠమైన నౌకాదళం కూడా ఉండాలి.

యుద్ధం గెలవాలంటే శత్రువుకి సప్లయిలు అందకుండాచేసి, హైరోఫ్టాన్స్ లను చంపి, ఆర్థికదిగ్బంధన చేయాలి. దీనికి కూడా బలిష్ఠ నౌకాదళం అవసరం.

శత్రు నౌకాదళంకన్నా కొంచం ఎక్కువ బలంగా మన నౌకాదళం ఉన్నంతమాత్రాన గెలుపురాదు. శత్రువు సాధ్యమైనంతవరకూ తన నౌకలను కాపాడుకుంటూ, పారిపోతూ, రేవుల్లో చేరిఉంటాడు. వాళ్లను ఆ రేవుల్లోనే అకట్టి ఉంచటానికీ, వాళ్ల నౌకలు విడివిడిగా చెలరేగకుండా చూడటానికి మనకు పెద్ద నౌకాదళం ఉండాలి.

ఇండియా ఆస్నేయాసియాలో చాలా ముఖ్యస్థానంలో ఉన్నది. తూర్పు పశ్చిమ ప్రపంచాల కూడలిలో ఉన్నది. అందుకని, తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకుని, అభివృద్ధిపొందాలంటే ఈ దేశానికి బలమైన నౌకాదళం ఉంటటం ఆవశ్యకరం

యుద్ధంలో పనిచేయాలంటే ఎంతో మంది సిబ్బంది అవసరం. 7 వేటన్నుల 'ఢిల్లీ'లో 700 మంది సిబ్బంది ఉన్నారు. ఈ సిబ్బందికీ, ఆయుధాలనూ, మందుగుండు, తదితర అవసరవస్తువులను యుద్ధనౌకలు తీసుకెళ్ళవలసి ఉన్నది.

సముద్రంలో పడ్డవారిని రక్షించటానికీ, తీరానికి వెళ్లిరావటానికీ కావలసిన చిన్న పడవలు మాత్రమే యుద్ధనౌకలలో ఉంటవి. అవాంతర సమయాల్లో వాడటానికి తెప్పలు మొదలైనవి—పని గడపగలిగినవే—ఉంటవికాని సౌకర్యాలు తక్కువ.

శత్రువుల దెబ్బ తట్టుకొనటానికి యుద్ధనౌకలన్నిటికీ ఉక్కు కవచాలు ఉంటవి. నీళ్ళ అడుగున దెబ్బతిన్నా మునగకుండా ఉంచటానికీ, నౌక సమతూకంగా ఉండటానికిగాను నౌక కడుపు కొన్ని గదులుగా విభజించబడి ఉంటుంది. ఈ గదుల్లోకి గాలికూడా జొరబడదు గనుక ఒకభాగం దెబ్బతిన్నా మిగిలిన గదులు తెప్పవలె నౌకను తేల్చి ఉంచుతవి.



కాప్టెన్ బి. యస్. సోమన్—
12 వ ఫ్రిగేట్ దళం

## యుద్ధనౌక అంటే ఏమిటి?

(7-వ పేజి తరువాయి)

నికి ఫిరంగులు, టార్పిడోలు, సబ్మెరీన్ల మీదికి డెప్త్‌ఛార్జిలు, ఆస్డికోలు, విమానాల మీదికి విమాన విధ్వంసక ఫిరంగులు, శత్రువుల జాడ తెలుసుకొనటానికి రాడార్, సైరన్ మొదలైన ఎన్నో పరికరాలను యుద్ధనౌకలు వాడుతవి. ఇవన్నీ యుద్ధసమ

## నౌకాదళంలో విద్యాబోధన

(7వ పేజి తరువాయి)

వాళ్ళకూ తోడ్పడతాడు. గ్రంథాలయాన్ని నిర్వహించటం, వర్తమాన వ్యవహారాలమీద ఉపన్యాసాలివ్వటం, నౌకవెళ్ళే ప్రదేశాల చరిత్రలను తెలియజేయటం, చూడవలసిన ప్రదేశాలనుగురించి చెప్పటం మొదలైనవి చేస్తూఉంటాడు.

నౌకాదళంలో ఉన్న ఒక పెద్ద అవకాశం విదేశప్రయాణం. అందులో చేరిన వాళ్లు ప్రపంచంలోని వివిధ జాతులనూ గురించి స్వయంగాచూసి తెలుసుకోవచ్చును. ఇండియాలో అన్నిరకాల ఉద్యోగులకూ శిక్షణనిచ్చే వీలులేదు. కనుక చాల మంది బ్రిటన్‌కువెళ్ళి శిక్షణ తీసుకుంటున్నారు.

భారత నౌకాదళంలో పంజాబ్ దగ్గరి నుంచి దక్షిణదేశంవరకూ, బొంబాయి నుంచి నేపాల్‌వరకూ, అన్ని ప్రాంతాల వాళ్లు ఉన్నారు.



పతాకనౌక "హెచ్. యం. ఐ. యస్. ఢిల్లీ"

# సంపాదక లేఖలు

## చేనేత పరిశ్రమకు ప్రభుత్వ సహాయం

ఆర్యా,

చేనేత పరిశ్రమకు సహాయం చేయుటకై ప్రభుత్వం అక్టోబరు 26 తేదీన ప్రకటించిన ప్రణాళిక ఇంతవరకు అమలులోనికి రాకపోవడం విచారకరం.

ఈ ప్రణాళిక ననుసరించి ప్రభుత్వం చేయదలచిన సహాయము లివి. పనిచేయకుండా మానిన చేనేత సహకారసంఘాలను పునరుద్ధరించి సభ్యులకు పనికల్పించడము, పనిలేకుండావున్న చేనేత పారిశ్రామికులకు వాటా ధనములను అప్పుగా యిచ్చి వారందరిని ప్రస్తుతము పనిచేయుచున్న, లేక నూతనముగా నిర్మించబడు చేనేత సహకారసంఘాలలో సభ్యులుగా చేర్పించి పనిచూపడం, సంఘాల కవసరమైన పెట్టుబడిని సమకూర్చడం, నెలకు మగ్గము 1 కి 20 నుండి 40 నెంబరులలోపల నూలును 60 లడ్డీలు సరఫరాచేసి లడ్డి 1 కి 0-6-0 ల మజూరిని యివ్వంచడం, ఆ విధంగా తయారుచేయబడిన బట్టల అమ్మకములో సంఘాలకు రాగల నష్టమును భరించడం.

కాని యీ ప్రణాళికవలన మగ్గమునకు రాగల ఆదాయము రు 22-8-0. ఇందు నుండి నూలు నిలుచుటకు, పడుగులుతోడుటకు, సరిచేయుటకు, పరిగింజలకు కనీసం రు 5-8-0 ఖర్చగును. వాటాధనం బాకీక్రింద నెలకు ప్రతి నేత పారిశ్రామికుడు రు 2-1-4 చెల్లించవలెను. పోగా కుటుంబపోషణకు మగ్గమునకు మిగిలే ఆదాయము రు 15-0-0. ఆహారధాన్యముల, మరి ఇతర జీవితావసర వస్తువులవెలలు విపరీతంగా పెరిగివున్న ఈ సమయమున మగ్గముపై ఆధారపడిన కుటుంబపోషణకు రు 15-0-0 లు యేవిధంగానూ సరిపోదు. కాబట్టి మద్రాస్ ప్రభుత్వం సహాయ ప్రణాళికను చేనేత కాంగ్రెస్ చే సూచింపబడిన విధంగా సవరించాలని విజ్ఞప్తి చేస్తున్నాను. (1) మగ్గముయొక్క నెలసరి నూలు వినియోగమును 60 లడ్డీలకు మితపరచక నేయకలిగినంతనూలును సరఫరాచేయవలెను. (2) లడ్డీ 1 కి 0-8-0 లకు తగ్గని మజూరీని యివ్వవలెను (3) క్రొత్త అచ్చులను, పన్నెలను ప్రభుత్వం ఉచితముగా సరఫరా చేయవలెను. (4) వాటాధనములను అప్పుగాగాక ఉచిత గ్రాంటులుగా యివ్వవలెను. (5) ప్రభుత్వావసరములకు కావలసిన బట్టలను చేనేత సహకార సంఘాలనుండి కొనవలెను. (6) చేనేతవస్త్రములపై అమ్మకంపన్ను తొలగించవలెను. (7) చేతి మగ్గములపై విశేషంగా తయారయ్యే బట్టలతో పోటీచేసే మిల్లుబట్టలను రాష్ట్రములోకి దిగుమతి చేయరాదు.

ప్రగడ కోటయ్య,
నిడుబ్రోలు.

* * *

## 'పాడిపంటలు' పత్రిక

ఆర్యా, మదరాసు ప్రభుత్వమువారు ప్రచురిస్తున్న 'పాడిపంటలు' పత్రిక ప్రజలకు చాల ఉపయోగకరమైనది. కాని ప్రభుత్వము ప్రచురణములో చూపే శ్రద్ధను పంపిణీలో చూపకపోవడం మూలాన దీనికి తగిన ప్రచారం రావటంలేదు. కోరిన వారికీ పత్రిక యిప్పుడు సులభంగా లభించవంలేదు. దీనికి కారణం ప్రకాశకులకు, చందాదారులకు యెకాయెకీ సంబంధం లేకపోవడమే. వ్యవసాయశాఖా డైరెక్టరుగారు దీన్ని ప్రచురిస్తారు. గవర్నమెంటు ప్రెస్సువారు ముద్రించి చందాదారులకు పంపిస్తారు. చందాలు చేరవలసినది ఆయా ప్రాంతాలలోని వ్యవసాయ శాఖాధికారులకు. వీరి ఆఫీసులలోని గుమాస్తాలకు ఇది అదనపుపని. కనుక వీలున్నవరకు యీ బాధ్యతనుండి తప్పుకోవడానికి వీరు ప్రయత్నిస్తారు. ఒక్కొక్కసారి చందాలు స్థానికంగా వుండే వ్యవసాయ మేస్త్రీలకు చెల్లించమని ఉత్తరవులు జారీ అవుతాయి. ఈ మేస్త్రీలకు వెదకుకొంటూ పోవలసిన అవసరం మరొకటి తటస్థం కావడంతో, చందాదారులు కాగోరువారి ఉత్సాహం సన్నగిలుతుంది. ఈ యిబ్బందిని దాటే తలంపుతో కొన్నిచోట్ల డెమాన్‌స్ట్రేటరులకు చందాలు మనియార్డరుద్వారా పంపితే అవి తిరిగిరావడంకూడ జరిగింది. మేస్త్రీలు చందాలు చెల్లించినవారికి వెంటనే రసీదు లివ్వడంలేదు. పత్రిక క్రమంగా రావడంలేదని ఎవ్వరికి చెప్పుకోవాలో చందాదారులకు తెలియదు. తెలంగాణములోను, రాష్ట్రేతర ప్రాంతములలోనూ వున్నవారి పత్రిక చందాలు నెవరికి చెల్లించాలో నిర్ణయమే కాలేదు.

ఈ విధంగా ప్రజల నిమిత్తం బయలు దేరిన "పాడిపంటలు" ప్రజల కందడానికి యెన్నో అంతరాయాలేర్పడినాయి. వీటికి ప్రతిక్రియగా వ్యవసాయశాఖా డైరెక్టరుగారే చందాలను నేరుగా స్వీకరించి, పత్రికను చందాదారులకు ప్రతినెలా సక్రమంగా అందించడానికి యేర్పాటు చేయవలసినదిగా వారికి దరఖాస్తు పంపుకున్నాము. లేకపోతే 'పాడిపంటలు', (పత్రిక) ప్రజలకు బాగా ఉపయోగపడడంపొసగదు.

పాతూరి నాగభూషణం, (విజయవాడ)

ఆర్యా,

తుపాను బాధిత ప్రాంతములోని చేనేత పారిశ్రామికుల స్థితి మిగుల దుఃఖకరముగా ఉన్నది. ఎందుచేతనంటే గత నాలుగైదు మాసములనుండి నేత మజూరీలు పూర్తిగా పడిపోయి వారు నిరుద్యోగులై ఉంటున్నారు. అలాంటి సమయములో తుపాను వచ్చి వారి ఇండ్లుపడిపోవడమే గాకుండా మగ్గాలు విరిగి, మగ్గాలపైన, యింట్లోను, ఉన్న పడుగులు, పేకలు తయారైన వస్త్రములు కూడా, తడిసి, చీకి, పనికిరాకుండా పోయినవి.

పరిస్థితులు యిలా ఉండగా కృష్ణా జిల్లాలో తుపాను బాధితులకు చేస్తున్న సహాయము కొన్నిచోట్ల చేనేత పారిశ్రామికులకు నిరాకరింపబడుచున్నట్లు తెలుస్తున్నది. 27-11-49 తేదీని బందరు చేనేత సహకార సంఘ కార్యాలయమున బహిరంగ సభలో అనేకమంది చేనేత పారిశ్రామికులు ఈ విషయాన్ని నాతో చెప్పారు. ఈ నాడు చేనేత కుటుంబానికి వస్తున్న నెలసరి ఆదాయము రు 15/— మాత్రమేనని ప్రభుత్వము అంగీకరించింది. ఇంతకంటే స్వల్పాదాయము మరెవ్వరికైనా ఉన్నదా? కనుక చేనేత కాంగ్రెస్ ప్రత్యేక మహాసభ కోరిన పూర్తి సహాయముచేసి తుపాను ప్రాంతమునందలి చేనేత వారల దుస్థితి తొలగేటట్లు చెయ్యాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

అక్కల కోటయ్య
పేరాల

* * *

## వ్యవసాయ పరిశోధన

లాం (గుంటూరు)

ఆర్యా,

నల్లరేగడ మెట్టభూముల రయితుల అభివృద్ధికొరకు 30 యేండ్లనుండి ఏడాదికి లక్ష రూపాయల ఖర్చుతో లాంవద్ద సర్కారువారు ఒక ఫారం నడుపుచున్నారు. కాని ఫారంలోని పద్ధతులు ఎంతమంది చుట్టుప్రక్కల రయితులు వాడుకలోనికి తెచ్చుకొని బాగుపడుచున్నారనేదే ఆ ఫారముయొక్క ఉపయోగమునకు పరీక్ష. పరిశోధనను నడిపే కోయంబుత్తూరు వ్యవసాయశాస్త్ర పండితులుగాని, ఆ ప్రోగ్రామును అమలులోపెట్టి రిపోర్టులువ్రాసే అధికారులుగాని, ఎప్పుడూ చుట్టుపక్కలనుండు అనుభవముకలిగిన రయితులను పిలిపించుకొని, సంప్రతించు ఆచారము లేకపోవుటే ఫారమునకును రయితులకును పొందిక లేదనుటకు ఒక గుర్తు. ప్రజారాజ్యము వచ్చినతర్వాత కూడా ఇంత ఉపయోగమును సంస్థగతి ఈరీతిగా యుండుట చాల విచారకరము. లాములో యున్న పశుపరిశోధన, వ్యవసాయ పరిశోధన ఫారములమీద ప్రభుత్వంవారు "కోతకన్ను" వేయుటెందుకో? చుట్టుపక్కనన్న రయితులను సలహాకమిటీగా పెట్టి పరిశోధన నడపకూడదా? రెండు ఫారములను కలిపి వ్యవసాయశాఖ యాజమాన్యమున "మిశ్రమ ఫార్మింగు" ఫారముగా నడపకూడదా?

తాడేపల్లి పరమానందము,
గుంటూరు.

* * *

## ఆంధ్ర సెక్రటేరియట్

ఆర్యా,

ఆంధ్రరాష్ట్రమునొక్క ప్రభుత్వ శాఖాధిపతుల కార్యాలయములకు కావలసిన సిబ్బందిని నిర్ణయించుకొనే విషయములో విభజనసంఘమువారు బహు జాగరూకులుగా ఉండవలెను.

ఆంధ్రరాష్ట్రమునకు కావలసిన సిబ్బందిని నిర్ణయించే సందర్భములో, ఇపుడు శాఖాధిపతుల కార్యాలయాలలో ఉండే తమిళ ఉద్యోగస్థులకే ప్రొమోషన్లకు ఎక్కువ అవకాశం ముండేటట్లును, ఆంధ్రులు ఎప్పటివలె తక్కువ తరగతి ఉద్యోగములలోనే ఉండేటట్టును, చాలవరకు కీలకస్థానములలో తమిళులకే అవకాశములు కలుగునట్లును ప్రభుత్వము వారికి శాఖాధిపతులు అంచనాలు పంపుచున్నట్లును తెలియుచున్నది. ఈ సమాధానాలు ఆంధ్ర ఉద్యోగులలో చాలా అసంతృప్తి కలిగించుచున్నట్లు కూడా తెలియుచున్నది. ప్రస్తుత అంచనాల ప్రకారము కనుక ఉద్యోగులను తీసుకొనినట్లైతే ఆంధ్రరాష్ట్ర కార్యకలాపాలను ఆంధ్రుల స్వభాష అయిన "తెలుగు"లో జరుపుకొనుటకు గల అవకాశములు ఉండవేమో అనే సందేహముకూడా కలుగుచున్నది. పై ఆఫీసులలో ఉండే ఒకటి, రెండువేల తమిళ ఉద్యోగస్థుల సౌకర్యార్థమై తమ స్వభాషలో ప్రభుత్వమువారు కార్యకలాపములు జరుపుకొనుటకు ఆక్షేపణలు కలుగవచ్చును. కాబట్టి విభజనసంఘమువారు ప్రస్తుతపు అంచనాలను తాత్కాలికంగానే అంగీకరించి, తాత్కాలికంగానే తమిళులను తీసుకొనుట మంచిదని నా సలహా. లేనిచో ముందు ముందు చాలా చిక్కులు రాగలవు.

ఒక ఆంధ్రుడు



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, G. T. Madras.